# సూఫీ వేదాంతదర్శము



ఇది

"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా కవిగారిచే

రచింపబడినది.



## శ్రీ విజ్ఞాన విద్యా పీఠము

పి ఠా పు ర ము

తూ॥ గో॥ జిల్లా.

**1987**

# శ్రీ ఉమర్ ఆలీషా కవిగారి
# జీవితసంగ్రహము

ఉమర్ ఆలీషా మహాకవిగారు పీఠికాపురమున క్రీ. శ. 1885 వ సం॥రంలో జన్మించిరి. వీరితండ్రిగారు మహర్షి మొహియద్దీన్ బాషా గురువర్యులు, వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు, ఆ ధ్యా త్మి క విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాసారంగదులు. వీరి కుటుంబము పూర్వమునుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యా సంపత్తికిని ప్రఖ్యాతిగాంచినది. శ్రీకవిగారు చిన్ననాడే సంస్కృ తాంధ్రములు విశేషముగా నభ్యసించిరి. తమపరి అరబ్బీ పారశీకాంగ్ల భాషలు నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయుట, మాట్లాడుట యెఱుంగు దురు; కాని ఆంగ్లపద్య కావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవే శము లేదు. వీరు సహజకవులు. వీరి 14వ వర్షమున తెనుగున ధారాళ ముగా కవిత్వముం జెప్పిరివీరి18వ యేట"మణిమాల"యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలె నున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరి కనేకచోట్ల ఉద్యో గములిచ్చెదమని ఆహ్వానించినను వాని కంగీకరింపక భాషాసేవ దేశ సేవఁజేయుచు తమ జీవితమును గడిపిరి. వీరు 1934వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. ఆపదవి వీరి మరణము వరకు నుండెను.

వీరికి International Academi of America వారు 1936 సం॥న Doctor of Literature బిరుదు మొఁసగిరి శ్రీకవిగారు వంశపారంపర్య ముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులైపదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యౌగికజ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుదు మొసంగిరి. వీరిసతీమణి అగ్బరు బీబీగారు వీరితో ఢిల్లీ నగరము వెళ్ళి ది. 5-4-35న దివి నలంకరించిరి. ఆదినమున ఢిల్లీశాసన

సభ మూయఁబడెను. వీరి గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమార్లు యిరువురు కుమార్తెలు పెక్కురు పౌత్రపౌత్రికలుండిరి.

శ్రీకవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయుబడు చున్నది. వీరు రచించిన సూఫి వేదాంతగ్రంథమందు వీరు జీవితము సంగ్రహముగా నిట్లువ్రాసిరి.

— స్వీ య ము —

క. ఆ మొహాయద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హితవి
ద్యామత"ఉమాలిషా" మహాకవి నేనున్.

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్యప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసిననాఁడను కల్పనాసక్త మతిపది
నాటకంబులను కర్ణాటుపక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

తే. రసము పెంపార నవధానక్రమములందు
ఆశులవులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమాలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజులఁ జూచితిన్ సుకవిరాజుల నోర్చితిఁ బేరుమ్రోయరా
రాజులఁ గొలగంబుల విరాజితపండిత సత్కవిప్రద వి
భ్రాజిత మౌలవిబిరుద పట్టములందితి యూనివర్సిటిన్
దేజముమీఱ సభ్యుడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమంబున్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రలిషా" కవీంద్రుఁడన్.

ఉ. వేలురచించి విద్యలనుబెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయినూట పదియార్లను సింహతలాడముల్ మహా
భీలకసత్కళాకనక విశ్రుతముల్ జయభేరి మ్రోయ హిం
తాల వనీనటత్కకవి తండము లేమిటి లెక్క మాకడన్.

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గము మెక్కి మతిని చక్కాడియాడి;
బోధించితిని జ్ఞానసాధనక్రమములు
చెవిసిల్లుగాఁ జేసి చెప్పి చెప్పి;
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగరవెూపి మోపి.

తే. ఇప్పుడప్పుడె నలుబది యేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాటికైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

మ. నను నీజ్ఞానమహాసభాసదులు నానందాన నర్థించి 'ఆ
దిని మీపూర్వపితామహుల్ గురువులై దివ్యత్వమేసారఁగా
ఘనవిజ్ఞానకళా ప్రవృష్టి ప్రజహృత్కాంతారముల్ నింపి రా
మని మీరాకృతి బోధసేయఁదగు 'ఉంమ్రాలీష' బాషాగతిన్.

మ. అని నెయ్యంబునఁ గోరఁగా విని మహాహర్షంబు సంధిల్ల నా
నని యా జ్ఞానమహాసభాకథన మత్యంతంబు కష్టంబు మే
దిని సంసారనిమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబు గా
దని యున్నంత నెఱుంగసేతునని నే నారంభమున్ జేసితిన్.

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జేరి నేఁ
గోరఁగ జ్ఞాన సభ్యులు నకుంఠితదీక్ష జగంబు మెచ్చఁగా
భూరితప స్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండుఁ జూచితే.

చ. కవిత నెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితి పుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటము రాదు, నుపన్యసించు నా
దినముల విద్యతోఁ గలసి తృప్తిఘటించెడు వాని నిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమిచెప్పుదున్.

శా. ఢిల్లి భారతశాసనైకసభ రూఢిన్ ప్రాతినిధ్యంబు సం
ధిల్లన్‌జేరిమహత్తరోజ్జ్వలకళాధిక్యంబురంజిల్ల వి
ద్వల్లోకంబున రాజకీయకలనావ్యాపార పారంగతం
బెల్లన్ వేడ్కను నిర్వహించుచును నేనీగ్రంథమున్ *వ్రాసితిన్.

ఉ. ఏమహిమాలయంబుపయి కెక్కి తపస్వులఁ జూచి వారి వి
జ్ఞానములన్ గ్రహించి విజనంబగుచోటు రచించినాఁడ నా
నా నవ కావ్యమార్గము లనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడునట్లు దృశంబు మార్చుచున్.

శా. నాలోనున్నవి నేనుజూచినవి విజ్ఞానంబులై లోకమం
దాలోకింపఁగ రాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గమే
మేలా దాచెదమంచుఁ జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరఁగన్.

కం. మా తాతయు మాతండ్రియు
ఖ్యాతిని అఖిలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతుల వివరింతు యోగరీతులు తెలియన్.

— ◆ అ గ్బ రా ం బ ◆—

శా. ఆ ఢిల్లీ నగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాఁకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నానతి ఆగ్బరాంబిక చలత్ విద్యుల్లతన్ బోలె ;యీ
నాఁ డేనశ్రులు 'గోరి' పైవిడుచుచు న్వర్తింతు నిర్జీవినై.

ఉ. ఏను రచించినట్టి కృతు లెన్నిఁటినో విని తల్లి ; తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాఁడగ జూచినారు ; ఢి
ల్లీ నగ రాంగ్ల భారతమహీధవ శాసనసభ్య సత్పదం
బానఁగ గాంచి 'అగ్బ' రమరాలయమేగె వెలుంగుచుక్కయై.

---

* సూఫీవేదాంతదర్శము

శా. ఎన్నో బాధలు బొందుచుండు మని నన్నీ భూమివర్జించి యా
పున్నెంపుంగని ఆగ్బరేఁగె దివికిన్ బూర్ణేందుబింబంబు వా
ర్ధి న్నిద్రింపగ బోయిన ట్లిఁక మహాంధీభూత మాలిన్య సం
ఛన్నాత్మన్నివిషిద్ధజీవిత మభాసం బెన్ని నా ళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాఁడగా లేదు
పరమసాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాఁగ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించి నాత్మశాంతి

తే. ప్రతిదినంబు చదువు ఖురాన్నమాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె ఆగ్బ
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ.

చం. పరమపవిత్ర యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికిబారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థనసేయుచు నెల్ల వేళసన్.

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లీలో బ్రిటీషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
పుల్లాబ్జానన 'అగ్బరాంబిక' భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లన్ విచ్చిన కుందఁబోలె వెస నే జీరాడుచున్నా నిటున్.

చం. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁగన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిమ్న లోకములఁ జేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరుమార్గము విచారణజేయుట లెస్సయైహిక
స్పద విభవానుషంగభవబంధమువాసిన నిన్ను చూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాంమతస్థులు. వీలు మాతృభాషఉర్దూ. ఆంధ్ర భాష మాతృభాషగా కానివారు తెనుఁగున సరసకవిత్వముఁ జెప్పిన వారు ఈ కవిగారొక్కరే వీరు రచించిన మహాభారత కౌరవరంగ మను నాటకమున___

నాటకముల్ ప్రబంధము లనంతముగా రచియించి వాణి కా
వ్యాటవి భావవీధుల విహార మొనర్ప జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుత ఉం రలీషా కవీంద్రుడున్...."
అనివ్రాసిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివరకున్నవి. శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమగోదావరిజిల్లా) వెళ్ళి అచ్చట ది 23 జనవరి 1945వ నాటి సాయంత్రము 5గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతికదేహమును పిఠాపురముఁ దెచ్చి 24వ తేదీ సాయంత్రము రైలుస్టేషనువద్ద నున్నవారి యరామములో సమాధి చేసిరి.

# పీఠిక

సూఫీవేదాంతదర్శమను నీ నిగమనిగమాంతప్రతిపాదక దివ్యాధ్యాత్మిక మహామహనీయ తత్త్వసంహిత యపురూపమును ననంతమును ననిర్వాచ్యమును నవాఙ్మాన నగోచరమును నైన నీశ్వరజీవస్వరూప నిర్ణయమొనరింప మహా కావ్యము. ఇది కేవల ద్రష్టదర్శనాదిక చైతన్యేతర పదార్థ మిశ్రితపరబ్రహ్మై కాగ్రతయందు తమోనివృత్తికిఁ దావలమై ముముక్షువునకు మార్గదర్శకమై మహ త్తర తేజోవిరాజితమైన దివ్యపథమునకు నిర్వాణరూప మహాశాంతిధామ మమృ తావసథమునకుఁగొంపోవుచున్నది. తనమోక్షము తనచేతులలోనే యున్నది. అదికరతలామలకము చేయుటయే యీగ్రంథముయొక్క మహదాశయము. ఇందుసూఫీలను మహ్మదీయతాత్వికులును వేదాంతులను సన్యాసులుభావాంతవర్తి యైన నీశ్వరసాయుజ్యము తదేకత్వసిద్ధియేతీరుసాధించిరో యాయపరోక్షవిజ్ఞాన మహావకాశములీపద్యరూపమున జిత్రించి గొప్పరహస్యములు మర్మగర్భితమైన అయాపాషాణప్రాయములైన యోగనిగూఢములిందు విప్పి విశ్వాకృతినిగల సద త్పదార్థముల భేదించి చిత్తనివృత్తిని ప్రశాంతద్యోతకవిద్యాప్రవృత్తిని మిథ్యావి భూతమాయోపాధిక జగదంతర్లీనజడానురాగములను నిష్కామప్రపత్తి సుపశ మింపఁజేసి పరమ ధర్మాన్వితపురుషార్థము లాకాంక్షకు దిగఁజారనీయక స్వేచ్ఛా నుమో ముల మేళవించి ప్రేమాకృష్యములైన ప్రభాతములు మూర్తిభవించిన చంద్రచంద్రికల నెలుగెత్తి ప్రత్యేకవ్యక్తిని ప్రకటించు ద్విజావళివలె నానవో న్మత్త ప్రతిభావిభాసముల పోలికలు పారము ముట్టించి దివ్యతరపవిత్రీభూతప్ర వర్తనాప్రకారపు పునాదులపై పెట్టిదిశాంతములు ప్రతిధ్వనింపనట్టు దిక్కుంభి కుంభాలపైహృదయనిస్స్వనముపెట్టి బ్రహ్మాండములు బీటలువారునట్లుజ్ఞానవిద్యా పీఠ మహాసభాసభ్యుని ముక్తకంఠము నందలి ప్రేమగానరసవాహిని ప్రజాహృద యక్షేత్రముల పాఱిపోర్లి సస్యశ్యామలమై కేదారములచేవంగి రుచులచే వన్నెయు వాసియు గాంచి సౌరభములచే పైకెగసియనూనాధికవ్యక్తిత్వమును ప్రతిష్ఠించు తెలుఁగున పెక్కుత్రోవలు కవితాశిల్పమున ననల్పపాండితీ ప్రతిభా ప్రపంచమును చిత్రింపఁబడినది.

ఇది దేనికిని యనువాదము గాదు. అద్వితీయమైన నీయర్థములు ఉత్ప్రేక్ష్యములుగా నున్నవి. ఉన్నవి యున్నట్లుగా గ్రహించి మననముచేసిన నవి గొప్పచరిత్రాత్మక ఫలసిద్ధి నీయఁజాలుచున్నవి. ఇందేమియు నతిశయోక్తులు కల్పనలునాడంబరములులేవు. మతమతాంతరభేదగ్రాహ్యక వ్యాసంగములున్నవి సమన్వయించి యినుమును బంగారము సేయువాని తెఱంగున జడస్వరూపియగు జీవుని దేవునిగాఁజేసి దివ్యాద్వైతయోగసిద్ధి, 'వహదహులాషరీకలహు' 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' అను నభేదాద్యవసాయమునం దైక్యమైపోయిన తమోరూపక ప్రకృతి కధిష్ఠానమైన తాను నీశ్వరునకు బొసటయైబరముగాదను సమాధి లక్షణ లక్షిత మైనదివ్యశక్తి దేహాదులనుండియు నవస్థలనుండియు గుణత్రితయముల నుండయు విడఁదీసికేవలము ముముక్షుత్వ స్వరూప సాక్షాత్కారమున కాదర్శ మగుచున్న "అల్లా" ఈశ్వరస్వత్వము నందలి పరమార్థము తానుగానెఱింగి ఆతెలివిలో లోకజాలము లున్నట్లుగా తెలిసికొని చేతనా చేతన మహాపదార్థము లలోఁ గలిసిపోయి అవి తనలోఁ బెట్టిచూచి ఆతన్మయత్వమున సానువాద సాను రూప సానుసంధ్యమైన బ్రహ్మతత్త్వము జీవజడాదులు వదలించి కేవలాస్తికవిద్య త్వ్రలిబంధితమగు "అహం" వాచ్యార్థమున కన్వయించు నీవుగానెఱింగితరించి పరిశుద్ధుఁడవై మను మనుసిద్ధాంత మిది దర్శకుఁను మార్గదర్శమునునై యున్నది.

మా ప్రపితామహమైన కోవలో వందలాదివత్సరముల నుండి వేదాంత విద్య నుపదేశించు గొప్పపవిత్రపీఠము పారంపర్యముగ వచ్చుచున్నదినేఁనది. విజ్ఞానవిద్యాధ్యాత్మిక పీఠమను పేరఁబరఁగుచున్నది. ఇందు పదిపన్నెండువేల శిష్యులు సాధనఁజేయుచున్నారు. ఈగ్రంథమునందుగలపెక్కు మార్గములందెందరో నుత్తీర్ణులైనవారుగలరు. వీరలేటేట మాతండ్రి మహర్షి శ్రీమొహియదన్ బాద్షు గురు వర్యులు ది 10-2-28 స్వర్గమలంకరించిరి. వారిజయంతికై వచ్చు నభ్యులకై వ్రాసిన నివేదికల సందర్భమైనపద్యములును అఖిల భారతశాసనమహా సభకు ప్రతినిధిగ సిమ్లా వెళ్లి హిమాలయమున వసించినప్పుడు 1938 సం॥ వ్రాసినపద్యములును కూర్చి యీసూఫీవేదాంతదర్శ మనుపేరముగించితిని కాని యిది యపారపారావార సదృశమైనకళ దీనినిముగించ సాధ్యమైనదికాదు. కొన్ని పారిభాషిక పదములకు వ్యాఖ్యానములు వ్రాయవలసియుండెను.

శ్రీ విజ్ఞానవిద్యాపీఠ సభాసభ్యులు గొప్పయోగసాధనా తత్పరులగు మహాయోగులు. వీరినిగూర్చి నివేదికలో

మ. పరతత్త్వార్థములన్ గ్రహించి తనలో బ్రహ్మాండభాండంబులున్
మఱుగై యున్న తెఱంగెఱింగి ప్రజలీ మాయాతమోరాశిలో
నరయన్ రాని త్రికాలముల్ తెలిసి శ్రీవిజ్ఞానసభ్యులు సోదర
విజ్ఞానకళా ప్రపంచమున మార్తాండా కృతిన్ శోభిలున్.

శ్రీ విజ్ఞాన విద్యా పీఠము
పిఠాపురము
5-11-1987

ఇట్లు,
"బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా కవి.
M. L. A. (Central.)



శ్రీ విజ్ఞాన విద్యాపీఠ సభా సభ్యులచే ప్రకటించు

## "బ్రహ్మర్షి" ఉమర్ ఆలీషా

### క వి కృ త ము లు

---

1. శ్రీ మహమ్మదు రసూలువారి చరిత్ర
2. దానవధ
3. మహాభారత కౌరవ రంగము (నాటకం)
4. సూఫీవేదాంతదర్శము
5. అనసూయ (నాటకం)
6. కళ
7. ప్రభాత కథావళి (కథలు)
8. విషాద సౌందర్యము
9. విచిత్ర బిల్హణీయము
10. బ్రహ్మ విద్యావిలాసము
11. స్వర్గమాత (కందార్థములు)
12. తత్త్వసందేశము
13. పరతత్త్వకీర్తనలు
14. చంద్రగుప్త (నాటకం)
15. ఉమర్ ఖయ్యామ్
16. మణిమాల (నాటకం)
17. శాంత
18. ఖండకావ్యములు
19. బర్హిణీదేవి
20. పద్మావతి (నవల)
21. హాతత్త్వము
22. సాధనపథము

మ. వరకళ్యాణ గుణుండు శ్రీ మొహియుదీన్ బాహ్యాదుండాత్మ్యాది
వ్యరహస్యేశ్వర కేవభావవిదు దధ్యాత్మైక మార్గప్రభా
కరుణక్షోల వికీర్ణ ఘోర పటల సంపూతోరు సంసారసా
గరసంహార పదారుడాతనికి సత్కళ్యాణి చాన్బిమహావరలక్ష్మిం.



"బ్రహ్మ ఋషి"

శ్రీ మొహియుద్దీన్ బాద్షా

శ్రీ చానిబియాంబిక

# BRAHMARISHI
# DR. UMER ALI SHAH
## TELUGU POET.

"A really great man has ideas always greater than himself" This is more true of Dr. Umer Ali Shah, the immortal poet of the Telugu language, than anyone else. He was born in March 1887 in Pittapuram, a town in the Andhra State of India.

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue, and began writing verse when he wase a teenager. The qenius of the boy was at once recognized by Telugu scholars and his fame grew as a poet by the time hi was 18.

He wrote plays in Telugu which can only find a parrallel in Shakespeare's. Many Hindu poets and scholars began to pay tribute to this Muslim poet of the Telugulanguage and regarded him as a itern-poet in the Carlylian senes of the word.

His writings took a new shape in all branches of literature. Besides poetry he wrote novels, plays and essays which excelled the writings of the renowned Telugu scholars of the twentieth century, and so on his works found a permanent place in the annals of Telugu literature.

Today he stands alone like a pole star guiding those who are interested in Telugu litereture, and he is acknwledged as their great master who brought a change over literary forms in Telugu.

He also made fresh departures in almost every form of literature. His poetry has no parallel In Telugu, despite the great writers whose works no doubt come nearer to his standard, and yet, lack that charm and cadence, lucidity and masterly style both in narration and criticism.

His vast knowledge of Sanskit in which language also he was a scholar, contributed effectively towards his prodigious efforts in Telugu with his contribution Telugu leterature would be nowhere as rich as it is today.

What Shakespeare is to the English, what Dante is to the Italians. what Dr. Iqbal is to Urdu speaking Muslims, Dr. Ume Ali shah is to the Hindus of Andhra.

His writings have no other parallel, as I stated before, in any other literature of the world, becase they are the creation of one man. He had to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But alas ! It is confined to Andhra, and Andhra only, and its great merit lies hidden outside the state even in india, not to speak of foreign countries.

Yet his reputation, by a curious twist of fate, soared aloft

In 1936 the Internatioual Academy of America confirmed upon him the degree to doctor of literature for his thesis in Telugu. For a man with no university education to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

His was no ordinary intellent, thought he knew littie English when compared to his ability in Telugu and Sanskrit.

His works in Telugu are clear evidence of what he struggled for, lived for and clied for. He was out and out a nationalist purposed to reform the people around him culturally, socially economicily and politically, and accordingly he rendered youngman service to humanity at large during that little span of his meteoric rice.

He did everything in his capacity. His School of thohght Pervaded all his works and helped remove the dogmatic ideas and beilefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue

This won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint His writings spelled the qualities of a great seer.

Though he was a Muslim, the magnanimity of the Hindus could not deprive him of what he was in truth, nor did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gave them the best of the life they needed. And he did not disappoint them.

Dr. Umer Ali Shah was also a social reformer in his own environs He had reformed the Hindus, customs and manners by dint of his profound knowlege of Sanskrit and the Hundu philosophy which he had mastered.

He know more them any Hindu scholar of his day. He could recite slokas so fluently and so correctly intepret them in Telugu that the pundits were stunned at his mastery.

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu literature and he came to be regarded as the only eminent poet in modern times in that language.

His writings created a sensation throught Telugu speaking areas both within and outside Andhra State. Indian universites adopted his works in their curricular for degree classes and no library is without his books.

His political career overlapped his literery one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other.

During the last decade of his life his literary fame was at its highest. while his political activities continued till his daeth.

He had to make mady trips every year from south to north to be presence in the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935. From them on he used to repair to the hill-tops of simla to invoke the muse and produce his master-pieces in Telugu literature, even in his political travails.

Apart from his literary acties, his political career was also remarkable He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound political ideas when he was in congress upto 1935.

He worked for the nation unhesitatingly during the khilafat movement and was held in high esteem by all the national leaders of those. times His assemble speeches contained sound principles of integrity and magnanimity and therefore saw the press of his day,

Besides, he worked for the good of the country delivering lectures everywhere irrespective of religian, cast or creed with a

view to promoting goodwill amongst the people for which he was adored by Muslims and Hindus alike.

when he was preoccupied with political affairs and when his literary fame was at its zenith, he was suddenly shaken by a tragic event His beloved wife Akbarbebi died Delhi In April 1935 when he was attending the sessions.

This shock are into his vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur.

His body was brought for burial ro Pittapuram where every year congregational meetings are held for one weekby his 20.000 disciples including eminent poets and scholars of Andhra state in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

—M. N- HUDA



క. జగమున ధర్మము నెల కొ
ల్పఁగ నీశ్వరుఁ డొక్క దివ్యవ్యక్తి నిఁ బంపున్
యుగ యుగమున నాతఁడె యీ
సగుణాత్మకుఁడైన సారసాక్షుఁడు గంటె.



## "బ్రహ్మఋషి" ఉమర్ ఆలీషా

అణువులయందు సుందర యజాండమునందు హిమాంబు సూక్ష్మపుం
గణములయందు సూర్యశశికాంతులయందు పరాత్పరా భవ
ద్వినుత విలాసవైఖరి ప్రవీణతఁ దోఁచుచు నున్నదింకనిన్
గనుగొన లేనిచో కనులు గల్గిన నంధులుగారె మానవుల్.

# పరంజ్యోతి

పడిన కష్టాలు పాటవంబలతిగాక !
సడలిపోయిన సౌఖ్యాలు స్మరణ రాగ
మాశిపోయిన మాటలు మరపురాక
పాటపాడిన పదములు పలుకలేక
వెడలిపోయిన కాలంబు వెదకుచుంటి
వెతుకుచుంటి నామరుగునే వెతకుచుంటి
తెలుసుకొంటి నామరుగునే తెలుసుకొంటి
తిరిగి కాలంబురాదని తెలుసుకొంటి (జన్మ)
లేదు పరతంత్రమికనాకు లేనెలేదు ;
లేదు నాయన్న మౌఢ్యంబు లేనెలేదు
స్వార్ధమున నీప్రకృతి నాకు స్వస్తి జెప్ప
భ్రాంతిలోగన్న విషయ విభ్రాంతిగాగ
పోవుచుంటి నాదారినే పోవుచుంటి
కాననంబులో పురములో కానరాని
ఆ అయోమయ మధ్వాన్నమైన దారి
అప్రళయకాల దంధయ్యమైన యట్టి
చిమ్మ చీకట్లు వెంగట చేరి చేరి
జరిగిపోయె సహస్సులు జగములోన
దాటిపోయెను మెన్నులా దారిలోన
స్వర్గ నరకాల వీధులాశ్చర్యముగను
దారులివ్వగ వాటిని దాటి నిలచి
చూచినా నది నిజముగ శూన్యజగము
కలతబడి మనో దుఃఖాన గలయజూడ
అంతదూరాన నేదియో నవతరించె
అందులో రూపమేదో నాకానుచుండె
అందు బ్రహ్మాండములును రూపొందుచుండె
ఎవరిదారూపు నాకపుడెరుక బడియె
అధియె నా గురుని స్వరూపమవధిగాను

అతడె అఖై లలీషుడు అది నిజంబు
అదియు ప్రేమైక రసరూప మవ్యయంబు
వెలువడెను గాచెనందుండి వెలుగదేదొ
నిండెనా వెల్గు జగముల నిండె నిజము
నిండె నావెల్గు నాలోన నిండె నిజము
నిండి నాలోన జతనావ మండిపోవ
నిలిచె సంతృప్తిం నాలోన నిలిచిపోవ
ఇమిడె ప్రమదంబు నాలోన నిమిడిపోవ
తెలిసె జగములు "నేన"ని తెలిసిపోయె
నేనె "విశ్వంబు" విశ్వంబు నేనె నిజము
నిజము యీ దృశ్యమంతయు "నేనె" నిజము
గగనములలోన నారూపె గానుపించె
భాస్కరునియందు నారూపె బరగుచుండె
సలిలమందును నారూపె సాగుచుండె
ఈవసుందర నారూపె యసగుచుండె
అరయ వాయువులో నిండినదిగొ దోచె
అదిగో వైశ్వానరుని నిండెనదిగొ చూడు
ఎన్ని చెప్పదు సర్వంబు "నేను" గాను
సృష్టినంతయు నాలోనె చూచినాడ
ఇదే పరంజ్యోతియన నొప్పు నీ వెలుంగు
ఇదియె యోగులుగన్నట్టి జ్యోతి సుమ్మ
నిలచిపోదు నీ జ్యోతి నేనెప్పటికిని
నిలచేపోయి నీ జ్యోతి నేనెప్పటికిని
రాను మిముజూడ వాంఛనే రాను రాను
తిరిగివచ్చెడి నాశలు తీరిపోయె
నెడలి వచ్చిన మాటలు వేరు లేవు
లీనమగుదు నీ జ్యోతిని నేనుగానె !
మరచిపొండింక నారాక మఱచిపొండు
వదలివేయుడు దర్భలు వదలునట్లు
విడచివేయుడు ధారను విడచునట్లు
ఇట్లు "హుస్సేనుషా కవి ఎరుక జెప్పె !

# శ్రీ విజ్ఞాన విద్యాపీఠాశయము

శ్రీ విజ్ఞాన విద్యాపీఠమహర్షి జ్ఞానవేదమూర్తులు శ్రీశ్రీ హుస్సేన్ షాకవి కృతంపాతత్వసంహితము యీశ్వరవాణిగా పలికి ఈశ్వరవాణి గా విశ్వమానవకోటికి శ్రీ విజ్ఞాన విద్యాపీఠ మహాసభాసభ్యులకు అమి తానందముగ చేయుచు భౌతికవిధానమందు అనేక జీవిత విశేషముల కులోనై విరక్తిభావము శారీరకముగా కలుగుటవలన మానసిక విశేష మును, పురస్కరించుకొని ధర్మప్రభోధమునుగావించి మానవుని మాన వుడుగా మార్చుటయే యీ ధర్మముయొక్క లక్ష్యము. అనగా శ్రీ విజ్ఞాన విద్యాపీఠముయొక్క విశేషము. ఇది సృష్టివుద్భవించి, యుగయుగాలుగా, తరతరాలుసృష్టిలో శాఖోపశాఖలుగా ఏకేశ్వరోపాస నచేయుచు, కృతి, స్మృతిలో స్మృతిగాపాడుచు జాతిమత విచక్షణలేక యదార్ధమైన రసస్వరూపము శ్రీపీఠాచార్యునిమంత్రప్రభావముచేత జీవి ఆత్మపరిణామము అభౌతికమైనటువంటి దృశ్యరూపములో చిత్రించుట యే శ్రీ విజ్ఞాన విద్యాపీఠముయొక్క లక్షణము. దాని యదార్ధ ధర్మ విషయము. ఇది ఆచరించి అనుసరించినవారికి అనుక్షణము లోకవిషయ వాంఛలను దూరముచేసి సంకల్పసిద్ధిఁజేయును.

# పద్యరత్నములు

1) సీ॥ తరతరంబులనుండి తాతతంత్రులుమున్న
విజ్ఞాన విషయంబు వివిధవిధము
మణులు మాణిక్యముల్ మదిని బడయునట్లు
సర్గపదార్ధద్వయము సంగ్రహించి
వివిధదేశంబులు వెడలి సభ్యకులము
వినుతిగావించి రావిశ్వమూర్తి

ఆధ్యాత్మవిద్యల కాకరం బగు మహా
జ్ఞానశక్తిని తపశ్శక్తి బడసి
తే॥ గీ॥ ధర్మమననేమి యో దెల్పి ధరణికెగసి
అమృతకరులై బోధకాధ్యాపకులుగ
నుండి పీఠికాపురమందు నోలగముల
ప్రభువులై యుండి రాహి "షా" వంశభవులు.

2) ఉ॥ అన్నిటికన్న గొప్పమహిమాస్పదమైన మహాత్మ్యముండు, నిం
దున్నది ఆ "షతత్వ" మనె నుత్తమగ్రంథము దైవదత్తమై
సన్నుతమై పవిత్రమయి శాసనమై సచరాచరంబులో
నున్న రహస్యముల్ దెలుపుచున్నది యీశ్వరవాణిసృష్టికిన్.

3) తే॥ గీ॥ ఇట్టి విజ్ఞానమతము నర్ధించి ప్రేమ
పాఠములునేర్పి విజ్ఞాన ఫక్కి గూర్చి
మానవోద్ధార కుండన మహిని వెలసి
మలినములుమాపె "హుస్సన్‌షా" మౌనివరుడు

4) తే॥ గీ॥ ఏదొ వేవెల్గు షాతత్వ నేగుదెంచి
అందులోన హుసనుషా కృతవతరించి
వచ్చినిలిచె తేజంబుగ వసుధయందు
దెచ్చితిని నీకిదేయని తేటపరచె.

5) తే॥ గీ॥ వేలు లక్షలు శిష్యులు పాలుగూడి
ప్రజ, లజ్ఞానతిమిరంబు బారద్రోలి
భద్రిమార్గమే కేశ్వరోపాసనంబు
ననుచు చాటిరి హృదయధర్మానుభూతి.

పంచరత్నములు సమాప్తము.

(పీఠాచార్య)



శ్రీ విజ్ఞాన విద్యా పీఠాచార్య
పి ఠా పు ర ము

సీ. సుందరంబుగనుండు సుడులతో గోదారి
చిరుగాలి కెరటాల పరుగులిడుచు
ఆణిముత్యాలట్టు అమరెడు బిందువుల్
మువ్వలరవళితో ముదముగొలుప
సప్తస్వరాలతో సంచరించెడి గాలి
కలహంసముని వీణ గతులబోలి
ఉరకలనురుగుతో ఉవ్వెత్తుగను పొంగి
పొరలు గంగానదీ పోల్కిదనరి

తే. గీ. కవి మనోహర హృదయంపు కందుకంబు
నవరసమ్ములతోగూడి నాట్యమాడి
కవితసాహిత్య వీధుల గదలిపోవ
గాన మొనరించి విహరించు గగనవీధి

క॥ రవిఅరుణ కాంతులతో
రవికృంగిన వేళరణము ముగిసినరీతిన్
రవిబోలు వీరవర్యులు
రవి తీరునప్రబలు చంద్రు రణవిఖ్యాతిన్.

తే. గీ. అస్తములుచాచి కంఠస్వ రంబు చీల్చి
కటిక చీకటి దాటించి కాంతిజూపి
కంటి కన్నీరు కారంగ కానబడక
కామమోహంబు సడలించి కాచుగురుడు

సీ. నల్లకాకుల గుంపు మలినంబు మాయింప
కాసారమున వడల్ కడుగురీతి
ఆశాహివలయాల ఆకర్షణమునుండి
విషయవాసనలను విడువలేక
షడ్ వర్గములనుండి సంచరించుచునుండి
ముక్తి మార్గముగాంచ మూర్ఖుడగుచు
కాషాయ వస్త్రముల్ ఘనముగా ధరియించి
కొంగజపముచేసి కొలనుమున్గ

తే. టి. కాని తనలోని కామంబు కడుగలేక
బాల్యయౌవ్వన కౌమార బలముతగ్గి
వార్ధికమువచ్చి వడవడ వడకిచచ్చు
వెఱ్ఱి జనులనుజూచినే వెఱగుపడుదు

కం. సిరిసంపద గలిగినచో
సిరమున మొలువగను కన్ను సిరిపతిననుచున్
శిరమున జేరునుగన్నులు
సిరినీయము దానమెప్పుడు చిరయశకార్తిన్

డా॥ ఉమర్ ఆలీషా, (B. H. M. S.)
భావిపీఠాధితి





భావిపీఠాధిపతి



శ్రీ విజ్ఞాన విద్యా పీఠాశ్రమము
పి ఠా పు ర ము

# కృతి

శా. శ్రీయాఖైలవిషాగురూత్తముని సం
సేవించు విద్యాప్రభా
ప్రాయం బైన వెలుంగు నింగిత ముషః
ప్రాభాతసంధ్యాతమో
ధ్యాయం బైన నిశాకవాటముల హ్రా
ద్ధ్వాంతంబుతోఁబాటు పోఁ
ద్రోయంజాలు తదీయ తేజ మొదనెం
తో వేట్క నర్థించెదన్.

# సూఫీ వేదాంత దర్శనము



శ్రీయును గైవల్యము జే
గీయ దయావైభవంబు గీర్తింప సదా
మేయాధేయం బగు తే
జోయుత రబ్ సతముగూర్చు శుభశతకంబుల్. 1

ఉ. ఏది రసస్వరూప మయి యీశ్వరసృష్టి నలంకరించి ప్రే
మోదయ సౌరభాప్తి హృదయోత్పలముల్ వికసింపఁజేసి యా
మోదసుధాస్రవంతులను, మోహన గానరవానుభూతి యై
యేదివెలుంగు నావెలుఁగు నీప్సితసిద్ధుల గూర్చుతేజమై. 2

శా. ఏకాలంబుననే ప్రపంచముననే యేవేళ యేయేకళల్
సాకల్యంబుగ సృష్టిసేయవలెనో సాగింపఁగాఁ గర్జమో
యాకల్యాణ కళాప్రపంచమును నిత్యం బెవ్వఁ డర్థించి తా
నై కల్పించి వెలుంగు నాతని మదిన్ ధ్యానింతు విశ్వాకృతిన్. 3

శా. స్వామీ ! నీమహనీయ వైభవ మహాభాండారమం దెందరో
యేమేమో కొనిపోవుచున్న నొక యింతే తగ్గిపోఁబోవ దీ
వేమార్గంబుల కడ్డుదూరవు ప్రపంచేచ్ఛావిహారక్రియా
సామాన్యార్థము లుగ్గడింపవు దయాసర్వస్వమున్ గూర్పఁగన్. 4

శా. నీమాయార్ణవ మెంతలోఁతు గలదో నీతేజ మేలాటిదో
యేమో నీనిజరూప మేవిధముగా నీక్షింపఁగా వచ్చునో
ఏమార్గంబున నిన్నుఁజేరఁగలమో యెందుంటివో నీవు దే
వా ! మాకండ్ల కదేల కానఁబడవయ్యా ! మ్రొక్కి యర్థింపఁగన్. 5

శా. నీవే సర్వము విశ్వరూపము మహానిర్వాణతేజంబు నా
నావిఖ్యాతకళాస్వరూప మధుపానానీక మాంద్యంబునం
దేవో మేము వచించుమాటలు భవత్తృప్తిన్ బ్రదీపించునో
కావో మాపొరపాటు లెంచకమమున్ గాపాడు మోయీశ్వరా ! 6

ఉ. ఏమని నిన్నుగొల్చుటకు నీశ్వర ! నీ యపురూపతేజ మే
మేమని చెప్పనేర్తు మిదమిత్థ మటంచు సమస్తలోకముల్
నీ మహనీయతేజమున నేర్పడుచున్నవి ని న్నెఱుంగఁగా
లేము నుతింపలేము గనలేము తపంబులు వేయి చేసినన్. 7

శా. నీవే యాచకకంబు నీవె మధుపానిర్వ్యాజతేజస్వ నా
పావిర్భావము నీవే దాతవు తదీయంబైన మైకంబులో
నీవే నంచు వివాదవీచికలలో నెంతే ప్రఖిన్నాత్ములై
పోవంజూచుచునుంటి మెంతయు నినున్ పూజింపలేకీశ్వరా ! 8

మ. సగుణబ్రహ్మముగాఁ దలంతురు నినున్ సన్యాసులున్ యోగులున్
నిగమంబుల్ నిగమాంతభావ్యచయముల్ నిన్నే యుపాశించు నా
భగవంతుండవు దేవదేవుఁడవు నిన్ బ్రార్థించువా రెల్లరున్
వగలన్ బాసి తరింతు రీప్సితమహాభాగ్యంబులన్ బొందుచున్. 9

మ. ప్రభుపూజారిని నేను నాతనిమహాభాగ్యంబు నాసొత్తుగా
నిభయాధంబుల నెత్తికొన్న నిసుమంతే తగ్గిపోలేదు మీ
కభయం బాతని దోఁచుకొండని భవద్వ్యాహారనిర్వ్యాణదుం
దుభి మ్రోయించెద రోదసీకుహరసందోహంబు మార్మ్రోయఁగన్

సీ. ఈ చరాచరసృష్టి యీ మహాసౌందర్య
మెవనిలో నణువుగా నెసఁగుచుండు
ఈ కళాలోకంబు నీయైంద్రజాలంబు
లెవని యాకాంక్షమై యెనసియుండు

ఈ యంతరాళంబు లీ యుడువీథులు
నెవనిలో నలుసులై నవయుచుండు
ఈ ప్రేమప్రళయాలు ఈరాగరసములు
నెవరిసంకల్పాన చవిలియుండు

తే. అట్టిఈశ్వరుఁ డన్ని తా నైన ఘనుఁడు
ఆయగోచరుఁ డిద్ధ మాయాపుయుంపు
ప్రేమహృదయాల నిల్చి కాన్పించుప్రభుఁడు
కరుణ గలవాఁడు నిఖిలలోకములఱేఁడు. 11

శా. స్వామీ! నిన్ను మనస్సులో తలఁపులో సర్వంసహాచక్రమం
దేమూలన్ బడి దాగియుంటివని నే నీక్షించి వేసారి నీ
వేమార్గంబునఁ గానరామి వగలన్ నిట్టూర్పులన్ బుచ్చుచున్
భూమిన్ వ్యర్థనిషిద్ధ జీవితము నే పూరింపగా నేర్తు నే. 12

## శ్రీ మహమ్మద్రసూలువారు

తే. గీ. శశిని రెండుగాఁ జీల్చి విశ్వముకదల్చి
నిల్చి సచరాచరం బెదఁ బిల్చి యొక్కఁ
డీశ్వరుం డని దివిని దర్శించినట్టి
శ్రీ మహమ్మద్రసూలు నర్థింతు సతము. 13

## వ ం గ డ ము

ఉ. ఆదిమదిన్ కబీరను మహర్షి మహమ్మదు వారివంశమ
ర్యాద పిరానెపీరను మహాత్ముని బోధసుధాబ్ధివీచికల్
మేదిని వ్యాప్తిఁ గాంచిన నమేయమహాపరతత్త్వసాధనో
పాధికమైన యాతెఱవుఁ బట్టి కృతార్థతఁ గాంచె నెంతయున్. 14

ఉ. ఆతఁడు పీఠికాపురమహానగరిన్ దొలుదొల్త నాన్నప
వ్రాతముఁ గొల్వ పౌరులును పండితులున్ దనశిష్యులై యథా
రీతి మహాత్మ్య మొక్కటి యెఱింగినఁ జూపుఁడటంచుఁ గోరఁగా
జేతము తొంగలింప సరె చెప్పెడు చూపెదనన్న నావుడున్. 15

ఉ. వారలు నింధనంబులను బండ్లకొలందిగఁ దెచ్చి కాల్చి యా
దారుణ వీతిహోత్రసముదాయమునన్ శయనింపుఁ డంచు పం
దారఁగ వారెఁజూచి ప్రమదంబున నవ్వి మునెన్ కబీరుఁ డా
లీలన నగ్నిఁజొచ్చెఁ దన తేజము దేవత లెల్ల మెచ్చఁగన్. 16

క. ఎనిమిదిగడియలు నాయ
గ్నిని శయనించెను కబీరు నిర్భరతేజో
వినుతవిహారుఁడు మాయా
మనుజై కవిదూరుఁ డిద్ధ మహిమాన్వితుఁడై. 17

వ. ఈప్రకారము :– 18

తే. గీ. అగ్ని వెలువడివచ్చి మహాప్రభాత
గరిమఁగాంచిన మావంశ మరయ పార
సీకమును బాసి ఢిల్లీకిఁ జేరి హైద్ర
బాదునుండి పిఠాపురి వచ్చి నిలచె. 19

ఆ. ఆమదిన్‌కబీరు నధ్యాత్మవిద్యయో
యన మధారషామహామహుండు
బుట్టి బ్రహ్మవిద్య బోధించె, బ్రజల యు
ల్లములు పల్లవింప నమృతినింప. 20

ఉ. ఆతనికిన్ హసన్మియష యా పరతత్త్వ పదప్రశస్తధా
రాతతశుద్ధ సత్వసముదంచితశీలుఁడు బుట్టి నీజన
వ్రాతమునేర్పె సచ్చరితఫక్కిని నైతికరాజకీయ వి
ద్యాతమశావృతం బగుయథార్థము తేజమునందు గాంచఁగన్. 21

ఉ. అలనికిన్ మహామహుఁడు నై జనియించి జయైక లోకవి
ఖ్యాతిగడించి యౌగికమహాత్మ్యము లంది 'కహేనెషావలీ'
పూతచరిత్రుఁడాతఁడు ప్రపుణ్యుఁడు మాకుఁ బితా మహుండు మా
యాతమసాప్తికిన్ ద్యుమణియై విలసిల్లెను తత్త్వదీక్షలన్. 22

సీ. వినిపించె పెక్కుభవిష్య దర్థంబులు
నా నాప్రపంచ విజ్ఞానగరిమ
అగపర్చె పెక్కుమహత్మ్యంబు లధ్యాత్మ
విద్యాప్రభావంబు వెలియునట్లు
శోధించె హృదయ విశోభిత తేజఃప్ర
పంచంబు నాకసోపానపంక్తి
సాధించె వివిధ కళాధామములలోని
యమృత స్వరూప దివ్యానుభూతి

తే. గీ. అట్టిమహనీయమూర్తి మహామహుండు
యోగవిజ్ఞానశక్తిచే నుభయలోక
ములను సంచార మొనరింపఁ గలిగినట్టి
శ్రీ కహనెషావలీని వర్ణింపఁదరమె. 23

తే. గీ. అతనిజనకుండు బాల్యంబునందు పోయె
నంత తత్త్వవిజ్ఞానంబు నభ్యసించు
కొఱకు 'అఖైలలీ' గురువరునిజేరి
సిద్ధిగాంచెను యోగప్రసిద్ధుడగుచు. 24

ఉ. వానికి ముప్వురాత్మజలు వర్ధిలి రందు మొహియ్యదీనుబా
ద్షానవభావ కోవిదుఁడు తత్త్వ విదుండు సమస్తధర్మ వి
జ్ఞాన కళాకలాపుఁడు నఖండ మహామహిమా స్వరూపుఁడై
మానవకోటి శిష్యులుగమార్చెను నెన్మిదివేలు లెక్కిడన్. 25

సీ. పారసీ సంస్కృతభాషార్ణవంబును
తరచి సారముఁదీసి తఱుఁగనట్టి
బ్రహ్మ విద్యాశక్తి పరమాత్మతత్త్వంబు
నంతరంగంబున నరసి యరసి

నిజతేజమున నిల్పి నిరవద్యమైన స
మాధినిష్ఠనుబూని మాయనంటు
కాపరంజ్యోతిలో నైక్యమై బ్రహ్మస్వ
రూపమేనని చెప్పి రూఢమతిని

తే. గీ. ఏమహాత్ముఁడమానసభూమిత్రవ్వి
జ్ఞానరసవాహినులఁదీసి సర్వశూన్య
ప్రకృతిలోపల తేజంబు బడసెనట్టి
శ్రీ మొహియదీన్‌బాద్ష వర్ణింపఁ దరమె. 26

వ. హృదయ కవాటముల్ తెఱచి యిద్ధతమస్సును జ్ఞానభాస్కరుం
బొదవి వెలార్చి నా తెరవుఁబోయి కళాకలితంబు నైన యీహ
సదనమునందు చక్షులను జాలమునుండి హరిస్వరూపమున్
మొప లగపర్చె నాగురునిమ్రొక్కెద శ్రీమోహిదీను బాదుషన్. 27

తే. గీ. పదియుఁదొమ్మిది నూర్లిరువదియు నెనిమి
దేండ్లు రెండవనెలకు నూఱేండ్లు నిండ
క్రీస్తుశకమున మా తండ్రి స్వస్తిజెప్పె
భౌతికము బాసి నిలువతత్త్వత్యగాత్మ. 28

ఉ. ఆమహనీయ వైభవ మహామహితంబగు బ్రహ్మతత్త్వవి
ద్యామహితాత్మ కంబును ప్రధానముజేసి నిజస్వరూప సౌ
ఖ్యామినిసాత్త్వికత్వపరిధానములన్ బతిపూజఁజేసి స్వ
ర్ధామముగట్టె మాజనని ధన్యతమ్రొక్కెద బాన్బియాంబికన్.

-♦ స్వీ య ము ♦-

క. ఆ మొహియద్దీన్ బాద్షా
నామమహాయోగి కగ్రనందనుఁడను నా
నామహితాగమ హిత వి
ద్యామతి "ఉమ్రాలిషా" మహాకవి నేనున్. 30

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్యప్ర
బంధముల్ పదికావ్యబంధములుగ
వ్రాసినాఁడనుకల్ప నాసక్తమతిపది
నాటకంబులను కర్నాటఫక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలుపదినవ నవలలనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండపా
రసికావ్యములుపది రసికులలర

తే. గీ. రసముపెంపార నవధానక్రమములందు
ఆశువులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమ్రాలిషాకవి" యనఁగ నేను. 31

ఉ. రాజులఁ జూచితిన్ సుకవిరాజుల నోర్చితిఁ బేరుమ్రోయ రా
రాజులనోలగంబుల విరాజిత పండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మౌలవీబిరుద పట్టములందితి యూనివర్సిటీన్
దేజముమీఱ సభ్యుఁడయితిన్ మతబోధకుఁడైతిఁ గ్రమ్మరన్. 32

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారువి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో

హాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమినే సుప
న్యాసములిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రలిషా" కవీంద్రుఁడన్. 33

ఉ. వేలు రచించి విద్యలసువెట్టి గడించితి హాలిలోషిరా
చ్యాళిని వేయినూట పదియార్లను సింహతలాటముల్ మహో
ఛ్ఛిలకనత్కళాకనక విశ్రుతముల్ జయభేరిమ్రోయ హం
తాలవనీనటత్కవి తండములేమిటి లెక్కమాకడన్. 34

సీ. సాధించితినియోగ సాధనంబులు హిమా
గమమెక్కిమతిని చక్కాడియాడి ;
బోధించితినిజ్ఞాన సాధనక్రమములు
చెవినిల్లుగాఁచేసి చెప్పి చెప్పి ;
సవరించితిని పెద్ద సారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి ;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగర మోపి మోపి ;

తే. గీ. ఇప్పుడిప్పుడె నలువది యేండ్లు పైన
దాఁటిపోయెను వయసు నీనాఁటికైన
శాంతిగలుగదు నీకథాధ్వాంతమందు
జీవితము తెన్నుసుడిబోవు నావబోలు. 35

మ. నను నీ జ్ఞాన మహాసభాసదులు నానందాన నర్తించి ఆ
దిని మీపూర్వపితామహుల్ గురువులై దివ్యత్వమేపారగా
ఘనవిజ్ఞానకళాప్రవృష్టి ప్రజహృత్కాంతారముల్ నింపిరా
మని మీరాకృతి బోధసేయఁదగు "ఉమ్రాలీష" భాషాగతిన్. 36

మ. అని నెయ్యంబునఁ గోరఁగావిని మహర్షంబు సంధిల్లనౌ
నని యీజ్ఞాన మహాసభా కథన మత్యంతంబు కష్టంబుమే

ఏన సంసారనిమగ్న మానసులు నర్థింపంగ సాధ్యంబుగా
వని యున్నంతనెఱుంగసేతునని నేనారంభమున్ జేసితిన్. 73

ఉ. భారతదేశ శాసనసభా సభికత్వపదంబుఁ జేర నేఁ
గోరఁగ జ్ఞానసభ్యులు నకుంఠితదీక్ష జగంబు మెచ్చగా
భూరితపస్సమాధి తమ బుద్ధిని నిల్పి జయంబుఁ దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండు జూచితే. 38

చం. కవితనెఱుంగనట్టి పృథుకాలము వ్రాసితిపుస్తకంబు లా
కవిత నెఱింగి వ్రాయుటకు గంటమురాదు నుపన్యసించునా
దినముల విద్యుతోఁ గలసి తృప్తిఘటించెడు వాని నిప్పుడో
లవము నుపన్యసించుటకు లజ్జఘటించెడు నేమి చెప్పుదున్. 39

శా. ఢిల్లీభారతశాసనైకసభ రూఢిన్ బ్రాతినిధ్యంబు సం
ధిల్లన్ జేరి మహత్తరోజ్జ్వలకళాధిక్యంబు రాజిల్లవి
ద్వల్లోకంబున రాజగీయకలనావ్యాపార పారంగతం
జెల్లన్ వేట్కను నిర్వహించుచును నే నీ గ్రంథమున్ వ్రాసితిన్. 40

ఉ. ఏను హిమాలయంబుపయి కెక్కి తపస్వులచూచి వారి వి
న్నాణములన్ గ్రహించి విజనంబగుచోట రచించినాఁడనా
నానవకావ్య మార్గములనంతముగా హృదయాంతరంగ వి
జ్ఞానము విశ్వరూపముగఁ గన్పడునట్లు దృశంబుమార్చుచున్. 41

శా. నాలోనున్నవి నేనుజూచినవి విన్నాణంబులై లోకమం
దాలోకింపఁగరాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబులం
దేలోటున్ జనియింపదీశ్వర రహస్యైకమీమార్గమే
మేలా దాచెదమంచు జెప్పితిమి మీరిద్ధాత్ములై తీరఁగన్. 42

ఉ. నామతమర్థ వాదములనం దగవెల్లరు చెప్పునట్టులే
మేము వచింప నీశ్వరు నెఱింగెడుదారిని విప్పిపెట్టిసౌ
దామినులందు వెల్లువలె తత్త్వమునంగు మహత్మ్యముల్ మహా
ధూమపథంబు జీవునకుఁ బుట్టినశింపనిత్రోవఁ జూపితిన్. 43

శా. ఏవోకొన్ని నిజాలు చెప్పుటకునే నెంతే ప్రయత్నించినా
భావంబందు రహస్యముల్ విడిచి సంభావించి యర్థించి యీ
త్రోవల్ విప్పితి సార్థవాహులకు సంతోషంబు రాజిల్లునా
హా విజ్ఞానము మూలసూత్రముగదా ! యధ్యాత్మిక వ్యక్తికిన్. 44

కం. మా తాతయు మా తండ్రియు
ఖ్యాతిని ఆషైలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతులు వివరింతు యోగరీతులు తెలియన్. 45

ఉ. ఎల్లరు జెప్పుచుండి రల యీశ్వరుఁ డీవని మీరుఁ గూడ నా
కల్లలుబొల్లు లల్లి కథగా నిటుకల్పనఁ జేసి చెప్పఁగా
నొల్లునె యంచు మీర లననోపుదురేమొ తదీయవాస్త వం
బల్ల రహస్యమున్ దెలిపి యద్భుతమార్గము విప్పి పెట్టితిన్. 46

మ. కనదుద్ పాదరసంబు తాత్త్వికుఁడు బంగారంబుగావించు న
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్ర
హ్మానుగామార్చెడు త్రోవఁజూపితి నిది ధ్యానంబు సంధించి మీ
కనులన్ విప్పుడు శూన్యమందు హరిసంకాశంబు సంధిల్లెడున్. 47

ఉ. మేము రచించుగీతములు మృత్యు వాయువుపథంబులందులో
నేమియు నర్థహాని కెడమియ్యక ఉన్నది యున్న యట్లుగా
నేమహనీయుఁడున్ నడచి యీశ్వరరూప మెఱుంగనేర్చునో
ఆమహితాత్ముఁడొక్కఁడెయదార్థమెఱింగి మృతిన్ జయించెడున్. 48

శా. నాతో నున్న మహాకవీశ్వరుల నానాకావ్యముల్ వ్రాసి నెం
త్తో తత్త్వాత్మకదృక్ప్రపంచకము నుద్యోగించి చిత్రించుచున్
చైతన్యంబు గలుంగఁజేసితి మహాసత్యస్వరూపంబుతోఁ
జేతో వీధిని నీశ్వరుంగనెడు వైచిత్ర్యంబుఁ జూపించితిన్. 49

ఉ. ఎవ్వరి నొవ్వనాడమిటు లెవ్వరినోరును కట్టివేయమే
మెవ్వరిదారిదూరిమరలింపము మాకడవచ్చువారితో
నివ్వటిలంగ నీ తెలివు నేర్చితరించుమటంచు చెప్పిమా
దివ్వెవెలుంగఁజేసెదము దివ్యలుగన్పడ బుద్ధిమాన్పడన్. 50

**-♦ అగ్బరాంబ ♦-**

శా. ఆ ఢిల్లీనగరాంగ్ల శాసనసభాభ్యర్థిత్వ మర్థింపుఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నాసతి అగ్బరాంబిక చలత్ విద్యుల్లతన్ బోలె యీ
నాఁడే నశ్రులు "గోరి"పై విడుచుచు స్వర్గింతు నిర్జీవినై. 51

ఉ. ఏను రచించినట్టి కృతు లెన్నిటినో విని తల్లి; తండ్రి నా
నానవనాటక ప్రకరణంబులు నాడఁగ జూచినారు ఢి
ల్లీనగరాంగ్ల భారతమహీధవశాసనసభ్య సత్పదం
బానఁగఁగాంచి 'అగ్బరమరాలయమేగె వెలుంగుచుక్కయై. 52

శా. ఎన్నో బాధలుబొందుచుండు మని న న్నీ భూమిపర్జించి యా
పున్నెంపుంగని అగ్బరేగె దివికిన్ బూర్ణేందుబింబంబు వా
ర్ధి న్నిద్రింపఁగఁబోయిన ట్లిఁక మహాంధీభూతమాలిన్యసం
ఛన్నాస్మన్నివిషిద్ధజీవిత మభావం బెన్నినాళ్లుండినన్. 53

సీ. ఏమాట చెప్పిన నెదురాడఁగాలేదు
పరమసాధ్వీత్వంబు వరలుకతన

ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాగఁ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించు నాత్మశాంతి

తే. గీ. ప్రతిదినంబును చదువు ఖురాన్న మాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్బ
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ. 54

చం. పరమపవిత్ర యీవెలది పండితురాలు నితాంతసత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికిబారెడు ప్రేమమూర్తి సుం
దరసముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి నీ
శ్వరునెద నగ్బరాంబకడు ప్రార్ధనసేయును నెల్లవేళలన్. 55

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటీషుసామ్రాజ్యంబు పాలించువా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
ఫుల్లాబ్జానన! "అగ్బరాంబిక" భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లున్ విచ్చినకుండఁబోలె వెస నే జీరాడుచున్నానిటన్. 56

ఉ. హృదయముముక్క లౌనటుల నేడ్చుచుఁ గన్నులనీరు కాల్వలై
పెదరఁగ నిమ్నలోకములఁజేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరుమార్గము విచారణఁజేయుటలెస్స యైహికా
స్పదవిభవానుషంగభవబంధమువాసిన నిన్నుచూడఁగన్. 57

## —♦ షష్ఠ్యంతములు ♦—

కం. శ్రీయాఖై లలిషాగురు
రాయనికిన్ సకలభక్తరక్షామణికిన్
మాయామయదూరునకున్
ధేయాధ్యాత్మైకతత్త్వ దృగ్ధారునకున్. 58

వ. సమర్పణంబు గావించి నా|వ్రాయు మహాతత్త్వార్థ|ప్రతిపాదకం బగు
సూఫీవేదాంతదర్శనమునకు కథావిధానం బెట్టిదనిన :-

## —♦ స భ ♦—

శా. మాకున్ జ్ఞానమహాసబా|ప్రథితసా|మ్రాజ్యంబు విద్యావ శే
షైకాకారలసత్ సముజ్వల మహాసర్వస్వమున్ |ప్రాక్సమా
లోకం బైనపథంబు నున్నదది దృగ్లోకంబు పూతంబుగాఁ
జేకూర్చున్ సముపాశితం బగు మహాశీలంబు విజ్ఞానమున్. 59

తే. గీ. ఈసభామందిరద్వార మెపుడు తెఱచి
యుండు ; పూతచరిత్రులై యుండువారు
వచ్చిజ్ఞానంబు నేర్చుకోవచ్చు సతము
మంచినీళ్ళను కలశాల ముంచునట్లు. 60

చ. ఇది మాహదావతారసభ యీశ్వరతత్త్వ మెఱుంగఁగోరు సం
పద గలవార లీబడిన పాఠములట్టుల నేర్చికొంటకై
మొదలిడె నీమతం బఖిలభూతలవాసులు స్వీకరింతు రిం
పొదవ స్వరాజ్యభానుని మహోదయ మిం దగు నంచు నమ్ముచున్. 61

ఉ. ఈసభ బ్రహ్మవిద్య నెఱింగించెడు తాత్త్విక పాఠశాల, నా
నా సముపాసితంబులు ననంతకళాలసితంబులౌ నుప
న్యాసము లిచ్చు సాధకజనంబు వసించెడు కాణయాచి రా
కాసులనైన మోక్షపథగాముల సేయు నటన్న వింతయే. 62

ఉ. ఈసభకున్ మనుష్య లోకరే యనరాదు రసాతలంబులో
వాసము సేయువారలును స్వర్గములో నివసించువార లా
భాసురచంద్రలోకముల భాసిలువారును వచ్చి బ్రహ్మ జి
జ్ఞాసను నేర్చుకొందురు నిజంబుగ జన్మ తరించునట్లుగన్. 63

ఉ. జ్ఞానమహాసభన్ దెలుపు జ్ఞానము దేహమునందు నాత్మవి
జ్ఞానము నేగతిన్ గలుగఁజాలునొ యెట్లది ముక్తి నొందునో
దేనిగ్రహించినన్ నిజముతేలునొ యావివరంబు లన్నియున్
మానసికంబుగాఁ దెలియుమార్గమె వేఱని యెంచరాదటన్. 64

ఉ. పూతచరిత్రులన్ బరమపుణ్య లగణ్య మహాపతివ్రతా
వ్రాతములన్ మహామహులు బంధురతత్త్వవిచారసాధనో
పేతులు వచ్చి వారు వినిపింతురు యోగరహస్యముల్ యథా
రీతి తపస్సమాధులఁ బరిశ్రమలార్షమతప్రకారముల్. 65

చ. మతములతోడ వారిమతమర్మములన్ గల ధర్మకర్మసం
గతములతోడ మాకు పని గల్గదు జ్ఞానమ యోగదీక్షలన్
మతి గడియించినట్టి నిజమార్గము వారిపవిత్రజీవిత
ప్రతతిని దెల్పు తాత్త్వికసభాసదనం బిది సభ్యసింపగన్. 66

ఉ. ఆపరతత్త్వమున్ దెలిసినట్టి మహామహులైన పండితుల్
భూపతులున్ గళావిదులు పొల్చెడు నీ సభ సర్వలోక వి
ద్యాపరిపూర్ణమై విమలమై కలుషాపహమై వెలుంగు నిం
దే పడయందగున్ బ్రజలు నీశ్వరరూప యథార్థ మంతయున్. 67

తే. గీ. ఎట్టియగచాటులును లేని యట్టిపథము
ఎట్టిపొరపాటులును లేని యట్టిదారి
ఆత్మ నీశ్వరు నీక్షించునట్టి త్రోవ
ఈమహాజ్ఞానసభ నభ్యసింపఁగలరు. 68

శా. స్వాతం త్రైక్య పరీక్ష వచ్చిన తపచ్ఛ క్తిన్ విమర్శించు వి
చ్యాత త్త్వంబు విధించి యీశ్వరనిధి ధ్యానంబులో దృశ్యమై
పాతాళంబుల మెట్టిపై కెగసి దివ్యద్యోధునీనాక సం
ఘాతంబుల్ బెకలింప నేర్చెదరు యోగజ్ఞాన విద్యాకృతిన్. 69

సీ. ఈసభా దృక్పథమేసుఁడీ గంగాప్ర
యాగాది తీర్థ యాత్రాభిగమన
మీసభారాధనమేసుఁ డీ దానవ్ర
తౌ ఘాదికముల కత్యంత ఫలము
ఈసభాధ్యాయనమే సుఁడీ యజ్ఞదీ
క్షాదికంబులకంటె నధికతరము
ఈసభావిజ్ఞానమే సుఁడీ జన్మ జ
న్మాంతరాదిక దోష శాంతికరము

తే. గీ. ఈసభా ధర్మపథమున కెరగువారు
సేమములఁ గాంచి యిష్టార్థసిద్ధిఁ బడసి
జన్మ తరియింప కలికల్మషములు తొలఁగ
శాశ్వతానందసాంద్రులై సాగుచుంద్రు. 70

తే. గీ. జీవచైతన్యమును మార్చి చిత్త మేర్చి
దృక్కు నార్చి నాహోజ్యోతి తేటుగూర్చి
చీఁకటి వెలార్చి జగము నిర్జింపఁగలరు
జ్ఞానసభ్యులు లోకవిఖ్యాతు లగుచు. 71

సీ. అతిపవిత్రతతో మహాప్రేమగరిమతోఁ
గ్రాలెడు వీరె చుట్టాలు మాకు
ప్రాణార్థముల నైన ప్రాభవంబుల నైన
నిచ్చెడు వీరె స్నేహితులు మాకు

జ్ఞానసాధనచేతఁ ధ్యాననిష్ఠనచేతఁ
దనరెడు వీరె సోదరులు మాకు
పూజ్య భావమునందు పుణ్య శీలమునందు
వర్ణింప వీరె దేవతలు మాకు

తే. గీ. వీరె చేఁదోడు వాఁదోడు వీరె మాకు
వీరె ముఖ్యులు తల్లులు వీరె మాకు
వీరె భక్తులు బిడ్డలు వీరె మాకు
మామహాజ్ఞానసభ జగన్మందిరముగ. 72

## -♦ ప్రబోధము ♦-

ఉ. మేలుకొనుండు నిద్రను నిమీలితలోచనులై ప్రభాతతే
జోలసితప్రభాపటలశోభితసృష్టి విలాసవిహ్వలో
ద్వేలనిగూఢతత్త్వ సముదీర్ణపరంపరఁ జూడకున్న నీ
కాలము వచ్చునే తిరిగి కాంచుదుమే మన మెన్నఁడేనియున్. 73

ఉ. కాలము పోవుచున్న దొడికంబునఁ బట్టఁగలేము మీరు రా
రేల నిజార్థముల్ చదువరేల ప్రభాతముహూర్తవిఘంటికార్థ వై
తాళికు లేమిపాడుచు మృదంగము మీటుచు నున్న వారొ, మీ
రేల ప్రశాంతులై వినరు నేటికి నేర్వరు బ్రహ్మతత్త్వమున్. 74

ఉ. చీఁకటియున్ బవళ్ళనెడు చేతులుచాఁచి రసస్వరూప వి
ద్యాకలశంబుతో నమృతదాన మొనర్చుచు యజ్ఞదీక్ష నా
నాకలుషాపహం బయి యనంత మగాధ మనూన బ్రహ్మత
త్త్వైకసుధాస్రవంతు లెదబర్వెడు గంటిరె జ్ఞాన సత్కళన్. 75

చ. ఎదియొ తరించుదారి పరికింప రనర్థము లైన కర్మలన్
గదిసి భవాబ్ధియందు మునుఁగన్ జనుచుందురు గాని విజ్ఞులై
మదిఁ దల పోసి యీశ్వరుని మర్మము సృష్టిరహస్య మేమిటో
వెదకరు చూపుమార్చి పృథివిన్ దలమోపిన తెల్లమౌఁకదా. 76

ఉ. ఆనిరవద్యమై చెదరనట్టి మహామహనీయుతత్త్వ వి
జ్ఞానము సూక్ష్మమార్గములఁ గాంచఁగవచ్చును దాని కిన్నినా
శ్యానని లెక్కలేదు హృదయంబు పవిత్రతఁ జెందనేని సో
పానము లెక్కినట్లు భవబంధము వాయుచు రొక్క పెట్టుకన్. 77

ఉ. ఆపరలోకజీవితమె యారయ శాశ్వత మెల్లవారి కే
లోపము లుండఁబోవు తనలోపలనున్న యథార్థవస్తువే
కాపుర ముండు నచ్చట నఖండసుఖై కరసప్రధానమై
దీపముబోలె వెల్గు తన తేజము నీశ్వరతేజ మొక్కటై. 78

సీ. గర్భవాసమునందు జ్ఞానంబు నేర్చెను
నసురబాలకుఁడు ప్రహ్లాదుఁ డరయ
అయిదేండ్ల ప్రాయాన హరిని సందర్శించి
కొండెక్కిపోయె ధృవుండు గంటె
బాల్యమం దరసి తపస్సమాధిని పర
మాత్మఁ గాంచిరి సనకాదిఋషులు
ఏడేండ్లనాఁడు కొండాన నల్లా మహా
మతిని గాంచెను మహమ్మద్రసూలు

గీ. ఇట్లుభక్త వతంసులు నెందరెంద
రీశ్వరుని గాంచి తరించి యిద్ధకీర్తి
గాంచిరో నేఁడు గ్రంథాలఁ గాంచఁగలరు
వారుపోయిన పోలేదు వారియశము. 79

ఉ. జ్ఞానరహస్య మంతయు నొకానొకమానవుఁడే గ్రహించి లో
కానకుఁ జాటలేదు కడుకష్టముతోఁ బరంపరంబుగా
దీన నెఱింగి యాతెఱవుదీసి హృదంతరదగ్ధబీజముల్
పూని పెకల్చి ప్రేమరసపూరితతేజము గాంచి రాదెసన్. 80

తే. గీ. అట్టిపథమున నుతీర్ణు లైనవారు
కృష్ణుఁడు పిరానెపిర్ మహర్షియును వేద
ఋషులు శ్రీమహమ్మదురసూ లిద్ధచరితు
లెనయ నీజ్ఞానవాహిని వసులబాటె. 81

ఉ. భౌతికమున్ ద్రికాలపరివంచిత దృశ్యధరాప్రపంచ సం
జాతము శూన్యమైన నిది స్వప్నముబోలిన దైన దీనిలో
లోఁతు సుషుమ్న మార్గమున లోచనముల్ నిగుడించి జ్యోతిలో
జ్యోతిని జూడవచ్చు నల శూన్యములోనె యగాధసత్యమున్. 82

ఉ. మిన్నొకలేనివస్తు వది మేఘజలాభము దోఁచుచుండు నీ
మన్నొక భూతకల్పము ప్రమాదము నైనది దీనివల్లనే
యున్నది మాయ దీనినెఱిఁగున్న ప్రపంచమె లేదు శూన్యము
ఛ్వాన్నముబోలెఁ దోఁచునపు డాపరతత్త్వము గోచరంబగున్. 83

ఉ. ఆపరతత్త్వమున్ దెలుపునట్టివె బోధలు గాథలందు నే
లా! పడిపోదురో జనులు నజ్ఞులు వారి పరిత్యజించి యే
రూపమునన్ స్వకీయ మపురూప మహామహనీయ దివ్యతే
జోపరిపూరితాకృతులు శోభిలునో యవె యభ్యసింపుఁడీ. 84

ఉ. ఎన్నిరహస్యముల్ దెలిసి యెన్ని యెఱింగిన నేమికార్య మే
నన్న మహాపదార్థము యథార్థముగా నెఱిఁగున్నఁగాని పై
వన్నియు వ్యర్థవాదము లనంతమహామహిమాస్వరూప సం
పన్నత వచ్చుదాఁక నిజభావసుధానిధి దచ్చఁగావలెన్. 85

చ. చదువును భాష లెల్లరకుసాధనఁ జేసిన వచ్చువిద్య లే
చదువును నీశ్వరుం దివిని సర్వజగంబులఁ జూడఁగల్గు నా
చదువు నెఱుఁగ రెవ్వరది వచ్చియెపోయెను ప్రాయికంబుగా
నది పునరుద్ధరించినఁ జరాచరముల్ చదువున్ ద్వదర్థముల్. 86

ఉ. కావున నెల్లవిద్యలకుఁ గారణమైనది సర్వలోక పూ
జావహమైన మానసికశక్తి యథావిధి నభ్యసించి యా
త్రోవను పోయి యీశ్వరునితో సచరాచర జీవకోటితో
నీవయి మాటలాడెద వదే మహనీయపథంబు తత్త్వమున్. 87

చ. పటములయందు ప్రాణము ప్రభాతములందు నిశాకవాటముల్
కుటిలవినీలకుంతలుల కౌంగున ప్రేమరసానుభూతి వి
స్ఫుటుఁ డవధూతకున్ దెలివి శూన్యములో వెలుఁగున్నదంచు నే
మిటికి భ్రమింతువో జగము మిథ్యని మిథ్యలులేవు నీదెసన్. 88

ఉ. కావున లోకసౌఖ్యములకంటెను ఆయమృతస్వరూప సం
భావిత శాంతిధామము విభాసితకాంతిని కేతనంబు మో
దావహమైన మోక్షమె సతంబుగదా! యది కల్గెనేని యీ
భూవలయంబు రాజ్యమును పూజ్యముగాదొకొ జ్ఞానయోగికిన్. 89

మ పవనంబుల్ విషయంబు లన్నవి మహావాఖ్యానముల్ తద్భవం
జవ దుఃఖార్ణవమున్ దరించుటకు విజ్ఞాతంబులై చాలియుం
డవు విజ్ఞానసమాధిలో వెలుఁగు రూఢంబౌ నదే వీఁకటిన్
దివియున్ సర్వము దానెయైన పథమున్ దీపించు విశ్వాకృతిన్. 90

ఉ. ఏల పటప్రదర్శనము లేల వికారపునాటకంబు లిం
కేల హృదంతరాళమున నీశ్వరసృష్టి చరాచరంబు లా
లీల నటింపుచుండ నవలీల యథావిధి వారితోడ నీ
కాలముబుచ్చ కీప్రకృతి కర్మలకల్మష మేల జ్ఞానికిన్. 91

ఉ. జ్ఞానము నిండుప్రేమను నకల్మష మాత్మసమర్పణంబులో
గానఁగవచ్చు నాప్రణయగానము నన్నిట నాలకించువాఁ
డే నిజమైనయోగి యతఁడేవిభుఁ డీశ్వరుఁడున్న గొప్పయ
స్థానమునందు నిల్చి ప్రమదంబునఁ జాటును ముక్తకంఠుఁడై. 92

ఉ. పావనజ్ఞానమార్గమునుబట్టి జితేంద్రియులై జగస్స్వరూ
పావహమైన దృశ్యములవంకను దృష్టి మరల్ప కీశ్వరుం
దేవుని జూడఁబోక తన తేజమునందు లయంబునొందు మీ
భావములోఁ జిదాత్మఁ గనవచ్చును చీఁకటి విచ్చునట్లుగన్. 93

ఉ. పారముముట్ట జ్ఞానము ప్రపత్తినెఱింగినవారు విశ్వసం
సారమలీమసం బయినసంగతి వాసి పరాత్ముఁడన్న ద
ర్బారునుజేరి ప్రేమమయ రాజ్యరథంబును నెక్కి జ్ఞానసం
స్కార జయధ్వజంబుగొని చాటుదు రాయెదభేరి మ్రోయఁగన్. 94

అ. గీ. భూనభోంతరాళములకున్న సంకెళ్లు
పట్టియూఁపవచ్చు నెట్టవచ్చు
యింతచెప్ప నేల యీతపచ్ఛక్తికి
భూతచయమె బెదరిపోవుచుండు. 95

క. జ్ఞానము సాధనలభ్యము
జ్ఞానము మాటలనులేదు కథఁ జెప్పుటకై
మానస మింద్రియవశమునఁ
బోని సమాధిని నెఱుంగఁబోలును తన్నున్. 96

ఉ. మానవలోకమంతకును మార్గమునై విలసిల్లునట్టి వి
జ్ఞానము దుర్లభం బనుచు చాటఁగఁజెల్లదు గాలియున్ జలం
బానఁగ నెట్లుసాధ్యమొ మహామహితం మగు నీశ్వరాకృతిన్
గానఁగ సాధ్యమౌ విదియె జ్ఞానము తక్కినవన్ని వ్యర్థముల్. 97

ఉ. ఐహికజీవితంబునకు నన్నమునీరము లెట్లగత్యమో
మోహవిదూరమై తిరిగిపుట్టని యాపరమార్థజీవిత
వ్యాహృతికిన్ దపోవిహితపద్ధతి కావలెఁగాదె లేనిచో
దేహము బుద్బుదాభ మని తెల్లముగాదొకొ యెల్లవారికిన్. 98

సీ. గృహమందునున్న నె గుహలందుడాఁగిన
జ్ఞానంబు ఫలమును గాంచవలయు
విజ్ఞాన మీశ్వర జిజ్ఞాసవ్యవసాయ
మట్లు ఫలప్రదమై తనర్చు
జీవజడత్వ విచ్ఛిన్నంబుఁజేసి యం
దమృతస్వరూపంబు నందవలయు
పగలు రేయను కాండపటముల మాటున
మరుగైన శక్తిని యెఱుఁగవలయు

తే. గీ. అవి యోంకార మీవని యరయవలయు
బిందునాదంబు కళయందు బెట్టవలయు
ప్రకృతి జీఁకటి యను తెరఁ బాయవలయు
నీ వునీ వై నచోటలో నిలువవలయు. 99

ఉ. చెప్పుఁడు జ్ఞాననేత్రములచేఁ దిలకించినవన్ని సత్యముల్
జెప్పుఁడు భక్తలోకము మలీమసమైన భవాబ్ధిదాటఁగాఁ
దెప్పలఁబోలు దీక్షలను తెల్వినిజీఁకటిపోవుదీపికల్
గుప్పలుగావెలుంగు మతిఁగూర్చుఁడు పామరులడ్డుచెప్పినన్. 100

ఉ. బాహ్యము నంతరంగ మనుభావములన్ విడనాఁడి వేసి దం
దహ్యముగాని యాతనువుఁ దాల్చిన నాత్మనిబద్ధమంచు దా
నూహ్యమటంచు మోసములనొందక బ్రహ్మపదార్థతత్త్వమై
తిహ్యముసేయ కీశ్వరుని దివ్యపదంబునఁ జూడు నీవుగన్. 101

తే. గీ. అతఁడె విజ్ఞాని వాని కజాండమంత
నల్లపూసగవచ్చి మున్నటను నిలుచు
అఖిల గుణగణముల తెదువణఁగిపోవు
తేట తెల్లంబుగా నాత్మ తెలియఁ బడును. 102

ఉ. వచ్చినపుట్టిదంచు బహువాటువులన్ వచియించెదీవు నీ
వెచ్చటకేఁగి యెచ్చటకుఁ యేగతివత్తువొ యెవ్వరీవొ ఆ
యచ్చపుమార్గమున్ దెలియకక్కట మాయనుబుట్టి మాయలోఁ
జచ్చి మరెట్లు పుట్టి చటుపాగిన నెన్నిజగంబులున్నవో. 103

ఉ. ఎక్కడ ఈశ్వరుండనుచు సృష్టిచరాచరభూతకోటి నల్
దిక్కులఁ బొక్కుచున్నది యచేపనిగాఁ జిరకాలమై వెసన్
జిక్కి మనుష్యుఁడేమి హరిజేరుటయేమి దురాశదుఃఖదు
ర్భుక్కుఁడు వంచకుండు తనమోక్షము తాఁగనబోఁడు లోభియై. 104

ఉ. లోభికిలేదు మోక్షము యలోకమహామహనీయసత్తహో
వై భవమున్నగాని నిజభక్తుఁడు దానము జేసిచేసి యా
లాభము ధ్యానమందొక కళానదృశంబుగఁ జూడ నేర్చు నా
నాభయవారకం బయిన నాకము మాటలలోన నున్నదే. 105

## — ఆస్తికము —

సీ. ఏజ్ఞాన మెఱిఁగిన నీశ్వరుండను మహా
తేజంబు రూఢమై తేజరిల్లు
ఏవిద్యఁ జదివిన నింద్రియారణ్యముల్
చేదింపఁబడి జ్ఞానసిద్ధి వచ్చు
ఏయుపాసనచేత మాయాత మోరాశి
విచ్చిపోయి ప్రదీప్తి వచ్చు సతము

యోనిష్ఠచేత విజ్ఞాన సామ్రాజ్యంబు
అడుగు మోపినచోటఁ బడయనగును

ఆ. వె. అట్టి బ్రహ్మవిద్య నాదర్శముగఁ జేసి
పాప తాప భయ నివారకంబు
నైన మానసికమునై నట్టి శక్తిగ
డింపవలయు మృతి జయింపవలయు. 106

ఉ. ఏదియు వేరుగాదు పరికించిన నీవు జగస్స్వరూపమై
యాదియనాది మధ్యవిలయంబగు దృశ్యము నన వాఁ డవీ
భేదము ప్రాయికంబగు వివేకము దాని పరిత్యజించి జ్ఞా
నోదయమన్న దెచ్చటఁ సమన్నదొ ఆయణువీవు జూడగన్. 107

సీ. పంచభూతములు సృష్టించినప్పుడు నేమ
హాపదార్థము తేజమై యెసంగె
జీవజాలంబులు చెన్నారునపుడేది
చూట్కులలోఁ దాంగి చూడఁ గలిగే
నీలమేఘములందు నెలలందు నేజ్యోతి
పరమాద్భుతంబుగా మెఱయఁ గలిగె
మంచుబిందువులందు మణులందు నేవెల్గు
ఐవిధవిధంబుల వెలయఁగలిగె

తే. గీ. అట్టి భాస్వత్ప్రపంచమే యానమునను
బోవువారికి దొరకునో బోధసేయఁ
గలుఁ గునదె బ్రహ్మవిద్య నిక్కముగదాని
ప్రజల కాణాచి యనినేర్చి బడయవలయు. 108

తే. గీ. అట్టి తేజంబు లోనొక్క యణువుపాటి
కాంతిజూచిరి వేదార్షి కాలమందు
ఆపరంజ్యోతి "మోసె" దీపాకృతిఁగని
జన్మతరియించెనని చెప్పఁజాలె నపుడు 109

తే. గీ. అదియె నీవారశూక సామ్యమునుదాల్చి
అణువు మొదలు మహా మేరువట్టులీధ
రాప్రపంచాలలో నిండి ప్రబలుచుండె
దాని దెలసిననింక బంధములు గలవె. 110

శా. ఆకాశంబునఁ జుక్కలన్ జలధి గర్భాగార మందుంచి నా
లోకించున్ వెసనీవు నీశ్వరుని నీలోఁ జూచి యానందవీ
చీకల్లోలిని దేలి జీవితమరీ చీశూన్య కాసారమం
దే కాంచందగు నీనిజాకృతి మహాదృశ్యంబ వశ్యంబగున్. 111

మ. ఇది యాధ్యాత్మిక విద్య కావున ప్రపంచేచ్ఛా విహారక్రియా
కదనంబుల్ విడనాడి బ్రహ్మపదజిజ్ఞాసన్ యథార్థార్థ సం
పద తత్త్వాకృతి తానుగా నెఱిఁగి సంభావించు విజ్ఞానికిన్
హృదయంబే దివిగాఁగ నీశ్వరుని వీక్షింపగ సాధ్యంబగున్. 112

ఉ. ఎవ్వఁడు నీశ్వరుండు ప్రభుఁడెవ్వఁ డటంచు విమర్శఁ జేసి తా
నెవ్వఁడొ యన్న మర్మము లెఱింగిననాఁడె యగోచరంబులౌ
నివ్వసుధాతలంబున ననేక విచిత్రకళా ప్రపంచమం
దవ్వలనుండు వాస్తవ పదార్థము లెల్ల నెఱుంగ నయ్యెడున్. 113

ఉ. ఏది నిజంబొ యీశ్వరున కేది యదార్థమొ యస్తినాస్తికుల్
కాదను వస్తువేదొ కొఱఁగాని వృథాపరికల్పితార్థ సం
వాదములందు జీవితము వ్యర్థముసేయుచు శూన్యమైన యీ
మేదిని వీడి పోదు రుపమింపరు నీశ్వర రూప మన్నిఁటన్. 114

ఉ. ఒక్కఁడు నాస్తికుండు మఱి యొక్కరుఁ డాస్తికుఁడంచు జెప్పనీ
ముక్కల కర్థ మొక్కటె ప్రపుణ్యపథంబున నిర్వు రీశ్వరుం
డెక్కడ నుండెనో యనుచు నెంతో విమర్శనఁ జేసిచేసి యా
ఫక్కిన చెప్పినారరయువారికి వాదమె లేదొకప్పుడున్. 115

తే. గీ. జగము మిథ్యని కొందఱు చాటుచుండ్రు
బ్రహ్మ మిథ్యని కొందఱు బలుకుచుందు
రిర్వురిటు మిథ్యావాదులే జగాన
నేదియును మిథ్యగాదు నీ వెఱిఁగియున్న. 116

ఉ. శంకము మాంసమిశ్రితవసామలినంబును దీసివేసి యా
శంకరుమ్రోల పూజలనుసల్పెడు నోరుగడించుకొన్నదా
వంకను ముక్కలై మురళిపాడుచునున్నది కృష్ణునోట నీ
పంకమువీడితే హరిని వాకిటఁగట్టెద వెల్లకాలమున్. 117

ఉ. గోచరుఁడీవులేవని యగోచరుఁడీశ్వరుఁడుండెనంచు దో
బూచులనాడి వేడుటకుఁ బోలిన చాటువు లేమియున్నవో
ఆచదువేమిటో తెలియ దారయ నీవను ఆస్తికంబులో
దోఁచెడిదేయనాత్మదివితో నమృతంబునుషన్ను సంధ్యలున్. 118

మ. నిజమో లేక యబద్ధమోయను మహానింద్రైక బుద్ధిన్ గుణ
వ్రజమందుండి వెలార్చి సుస్థిరము సంభావ్యంబునౌజ్ఞానకాం
తి జనింపన్ దగు రూఢి గైకొని హృదాధీనంబునౌ శక్తిచే
సృజియింపంబడు లోక మట్లు వెలిలో సృష్టిన్ విలోకింపుమా. 119

శా. అంతాశూన్యము నీవెయాస్తికము నీయందీ యజాండంబు రా
ద్ధాంతంబై విలసిల్లుచున్నది నిశాద్వారంబులన్ దీసి నీ
స్వాంతంబందు తితీక్షనిల్పునెడ విశ్వంబెల్ల శైలూషియై
యెంతోవింతగ నాట్యమాడగల దీసృష్టిన్ విడంబించుచున్. 120

## — అణువు —

చ. అణుసముదాయ మీదృశ మజాండముశ క్తిపదార్థమిశ్రితం
బునఁగలయట్టి యీప్రకృతిముందర దోఁచెడు విశ్వమెల్లనే
నని యనుకొన్నవానికె రహస్యములెల్ల నెఱుంగవచ్చు నా
మనసటు ద్రిప్పకున్న మఱిమార్గమె కానఁగ రాదొకప్పుడున్. 121

చ. అణువున రెండువస్తువు లయావితమై విలసిల్లుచుండు న
య్యణువు వెలుంగునున్ నిశికి నాకరమై కనుచూపుమేరలో
గనపడు నావెలుంగు నిశికంటెను తేటయియున్న తన్నిశిన్
వెనుకకు నెట్టలేదది రవిన్ గబళించెడు శూన్య మట్టులన్. 122

చ. అణువున రెండువస్తువు లహర్నిశమున్ విడనాఁడకుండ నుం
డును నిశియున్ వెలుంగు నొక డోలికఁబోసినరీతి వీనిలో
కనుల కగోచరంబయిన కాంతి ఘటిల్లుచునుండు ; వెల్గునున్
గన సముపాసనంబున గనంబడు నయ్యది మార్చుచీఁకటిన్. 123

చ. అణువులు రెండువస్తువులయందు గనంబడుచుండు నందులో
నణువు సమానరూపమను నట్టిదియున్నదికాని వానిలో
నణఁగినకాంతి చీఁకటులయందు లయంబగు బ్రహ్మతత్త్వమే
తన నిజరూపమంచు ప్రమదంబును బొందును జ్ఞాని రూఢుఁడై. 124

మ. ఒకమారీ నిఖిలప్రపంచమును నుద్యోగించి చంచత్కళా
చకితాభీలవివాదవహ్నిశిఖలన్ సంక్షోభమున్ బెట్టి తా
నకలంకుం డమృతస్వరూపియను విద్యాతత్త్వ సిద్ధాంతమున్
బ్రకటింపందగు జ్ఞాని లోకహృదయద్వారాలలో దూఱుచున్. 125

ఉ. పాఱెడు నీళ్లనున్ జెదలఁ బక్షులనాపెడు శక్తి యుక్తులే
దారినివచ్చునో యది యదార్థపుతత్త్వములోని పాఠముల్
నేరుపుగాన సాధకుఁ డనేకవిధంబులమాఱి సృష్టిలో
దూఱి పరాచరంబులను దోఁగుచుఁ జూచు రసస్వరూపముల్. 126

చ. మూడుఁడు లోకజాలములు మూడుక్కలలోపలనిండి రూఢమై
యాడెడుపాపలోపల యదార్థముగా నణుమాత్రమైన యా
గోడును నీవెఱింగిగనుగొన్నను చీఁకటి విచ్చిమాయతోఁ
గూడిన మబ్బులన్ని తొలఁగున్ బరలోకము గోచరం బగున్. 127

ఉ. మాటలు మానివేసి పరమాణువులన్ విడదీసి చూపులో
మాటయియున్న వెల్గు నొకమాటు బహిర్గతమున్ బొనర్చినన్
నాటకరంగమట్టుల గనంబడు విశ్వము స్వర్గలోక మ
చ్చోటఁ జరాచరంబగుచు శోభిలు నీశ్వర జీవరూపముల్. 128

ఉ. ఆదినిగల్గదొక్క యణువైనను తేజముదక్క దానిలో
నాదముపుట్టి యాకళను నాకము జీవులు భూతకోటియై
కాదన కీయజాండము ప్రకాశ మొనర్చెను రెండుగాకయే
కోదధివీచికాకృతి సమున్నతి నీగతి నిన్నెఱుంగగన్. 129

## -♦ సా ధ న ♦-

ఉ. కాలినలోహముల్ జలముగ్రైకొనినట్లు తపస్సమాధిలోఁ
గ్రాలెడు మానసంబు కడఁగంటను దేనినిజూచినన్ యథా
లీలగ్రహింపఁగల్గు నవలీల శిరంబు తపంబు సేయుచున్
నేలకు వంచెనేని ధరణింగలశక్తిని లాగునెంతయున్. 130

ఉ. ప్రాఁతవి పుస్తకంబులను వ్రాసినతత్త్వ పథంబులన్ యథా
రీతి పరిత్యజించి యొక రేఖను కాగితమందు గీసి యా
గీఁతకొనన్ దృగంచలము కేంద్రముచేసిన నందు విశ్వసం
జాతముచూడవచ్చు తన స్వాంతమె యద్దముగాగ నెంతయున్. 131

చ. అనలముదహ్యమాన మయినప్పుడు లేచెడు విస్ఫులింగముల్
ఘనతరజ్వాలలంగలిపి కన్నులఱెప్పలు మూయకుండఁగా
మనసునునిల్పి బ్రాహ్మికసమాధినిజూచిన యజ్ఞపురుషుం
డినుఁడు సుషుప్సుహోయనము లీశ్వరజీవులఁ గాననయ్యెడున్. 132

ఉ. పాఱెడునీరమేరయిన ప్రాణమువచ్చును దానిలోన వి
స్ఫారరసస్వరూప సముపాసిత తేజమువచ్చు నాకళా
ధారతెగంగస్వర్ధునినభంబున లేచినరీతి రేచకా
ధారముచే విలాసమతి దాఁటగవచ్చును మాటలాడుచున్. 133

చ. నిలువుననిల్చి పాదములు నేరుగ భూమికినింటినట్లుగాఁ
దలఁచి రసాతలాన మహితంబదుశక్తిని లాగుచున్న దృ
క్కులు వివశంబులై కొఱడుకొన్న శరీరమురీతి దాల్చి వి
హ్వలదశవచ్చి సర్వముబయల్ వలెఁదోఁచును శూన్యవిశ్వమున్. 134

ఉ. చేతులురెండుచేర్చి తనచిత్తముతోఁ గనుచూపులందులో
లోఁతుగపోవనిచ్చి తనలోఁగల తేజము మేళవించినన్
జేతనరూపకప్రకృతిచేతఁ జరాచరభూతకోటి సం
ఘాతము సూక్ష్మదేహములఁ గానఁగవచ్చు రసామృషంగమై. 135

ఉ. దీపముపెట్టి దానిపయి దృక్కులు కేంద్రముజేసెవేని యా
దీపమునొష్టనున్న నిజదీపముతో సయిదోఁడుగాఁగ దృ
గ్రూపముమాఱి పెద్దవెలుఁగున్ గనవచ్చు సుషుమ్న నుండియా
చూపు సమాధియైయమృతశోభితమై గనవచ్చు స్వర్గమున్. 136

ఉ. నొట్టను నేలఁబెట్టి తననోటను సోహముపాడి రేచకం
బట్టులగూర్చి పూరకము పట్టునలేపి నిజస్వరూప మా
మట్టునఁ దోఁచుచున్నటుల మార్చితమస్సును గప్పుకొంటినం
చట్టె తితీక్షనిల్పుము విహంగతిరస్కరణీ క్రియార్థమున్. 137

ఉ. వృక్షపునీడలిల్చి తలనెత్తి దృగంచలముల్ మరల్ప కా
దీక్షనుగన్న నాయగము దివ్యతరాకృతిదాల్చి వచ్చి ప్ర
త్యక్షముగాఁగ నాదతమవాగతముల్ వివరించి చెప్పునీ
భీక్షులకున్ జరాచరము భృత్యులు ; వేరెస్వరాజ్యమేటికిన్. 138

ఉ. చూడ్కులుఁ ద్రిప్పివేసి తనచూపును నూర్ధ్వముఖానఁ బెట్టి యా
మాట్కి హృదంతరాళమున మానసచక్షులువిప్పి విద్విషద్
షట్కముమార్చి నాయెఱుకబాటుననుండు సుషుమ్న చూచినన్
వేట్కసహస్రసూర్య సమవిశ్రుతకాంతి ఘటిల్లు నచ్చటన్. 139

ఉ. చూపులు మాఱకుండ నిజశోభితసృష్టివిలాస మీజగ
ద్రూపము ముందరన్ నిలిపి రూపరకుండఁగ చూచెనేని యీ
రూపముమాఱి యేదొయపురూపపుదృశ్యమువచ్చి యందు నీ
రూపము నీశ్వరుండనెడు రూపమునేకముగాఁగఁదోఁచెడున్. 140

ఉ. పాఱునదీజలాన పొలుపారు జగత్ప్రతిబింబమందు నీ
తోరపు నేత్రదృష్టి నిడుతోడనె యాబడబానలంబు శృం
గారరసానుభూతిమయి గానఁగవచ్చును యజ్ఞపూరుషా
కారము దాల్చి యామఱుఁగు గానని వారికి ముక్తి యున్నదే. 141

ఉ. అద్దమునందు నీప్రవిమలాకృతి గన్పడుచుండు కంటిలో
నిద్దురవోయి మ్రోన్పడిన నీ నిజరూపునుగూడ యందులో
దిద్దినరీతి దోఁచునది దృష్టిమరల్పక చూచెనేని యం
దెద్దియొ వెల్గువచ్చి పరమేశ్వరుఁడో యన గోచరంబగున్. 142

ఉ. వీలగుకాలితో బొటనవ్రేలునుబాఁచి సమాధినిష్ఠమై
కాలినరంబునున్ గఱచి కట్టియు రేచకపూరకంబులన్
గ్రాలెడు సోహనాదము మొగంబున మూఁడువిధాల త్రిప్పి పిం
గాళ యిడాసుషుమ్నలను గాంచినవారలు గాంతు రీశ్వరున్. 143

శా. ఆకాశంబునుజూచి మబ్బుతెరలన్ వ్యాఖ్యానముల్ చేసి యా
యాకారంబులు నక్షరాకృతిని నభ్యాసంబు గావింప నీ
లోకంబందు భవిష్యదర్థములలో లోఁతైనభావాలు నీ
కై కాన్పించు సమాధిలోఁగను మహాకాంతిన్ విడంబెంచుచున్. 144

ఉ. నేనయి యించుకేని యొనరింపఁగలేను పదార్థవంచనా
నూన వినూత్నభావముల నూని ప్రయత్నము చేయుచుంటలో
యేనయివచ్చి చేసి జను యేదొ యభౌతికశక్తి నామహా
జ్ఞానమె మానసైక మగుసాధన మందు మహత్మ్య మేర్పడున్. 145

ఉ. స్వర్గమటన్న సంకుచితభావము లన్నియు మానివేయు మా
మార్గము భూమివై భవరమాపరివర్తిత భోగభాగ్యనై
సర్గిక మంచు నెంచకు నిశాగల రిక్కనుబిల్చి నీవుగా
నిర్గమనంబుఁజేసి దివినిన్ దివిజాళిని చూడు తెల్లమౌ. 146

మ. ఒకదృష్టిన్ దనవంకఁబెట్టి తనలో నున్నట్టివిశ్వంబు యీ
ప్రకృతిన్ జూచినయట్టి భావమున సంభావించి బ్రహ్మస్వరూ
పకలాంబున నిన్నుబెట్టి యది సర్వస్వంబుగా నెంచినన్
గకుబంతంబులవార్త లెల్ల వినవౌ కళ్యాణసంధానమై. 147

ఉ. మాటలు వేయునేల యొకమాటను జెప్పెద బ్రహ్మతత్త్వ మీ
మాట రహస్య మన్నిటికీ మార్గము నీవనునట్టివస్తు వె
చ్చోటను నున్న శక్తిగల శుద్ధపదార్థము దానియందు నీ
పాట మరల్చిచూడుము ప్రపంచము గోచరమౌను రూఢమై. 148

ఉ. మాయనిమాపుతో నలిగి ముందరవచ్చెడు దేని నైన నో
హెూ యని జూచెదేని యది యుత్తదియై యిలవాలిపోవు మై
రేయము ద్రావినట్లు ; వివరింపఁగ రానిబలంబు నీమనో
ధ్యాయమునందు నున్నదని ; యంతయు సాధనవల్లవచ్చెడున్. 149

చ. ఒకయెడఁ గూరుచుండి తనయూహను రూపముజేసి దానితో
సకలగరాచరాత్మక విశాలజగంబును మెట్టవచ్చు ; నా
చకితకలాపలాపబలసంపద కొండలనైన లాగి తా
వక కరబద్ధగోళముగఁ బట్టగవచ్చును నిక్క మారయున్. 150

ఉ. చూపు మరల్చకుండ తను సొంపు నుతింపుచు చూచెనేని యా
రూపు నిజంబుగాఁ దనను జూచిన కైవడి నిల్చు నామహా
రూపమె స్వస్వరూప మది రూఢముగాఁ దనలోనిదంచు ద
ద్రూపము మార్చి పాపయి తోఁపఁగ జేయుటె సిద్ధి యోగికిన్. 151

ఉ. మానక పట్టుపట్టి పరమాణువులన్ గలవెల్గుకంటికిన్.
గానఁగ రాదు గాని యవి కాంచిన కైవడి నెంచి యల్ల వి
జ్ఞానమునందు దృష్టినిడి గాంచినరూపము దాల్చి దానిలోఁ
గానఁగ వచ్చు నీవనెడుకాంతి నితాంతనిజాత్మతత్త్వమున్. 152

ఉ, కాటుకఁ జేతఁబెట్టి తనకన్ను మరల్చక చూచుచుండ నా
చోటలనుండి కొంద అతిశోభితగాత్రులు వచ్చి పోవుచున్
మాటలలోనఁ జెప్పుదురు మ్రాన్పడ పూర్వభవిష్యదర్థముల్
పాటవ మొప్ప మానసిక పాఠము లెన్నియొ నున్నవీగతిన్. 153

చ. పిలుపులువచ్చు దూరముగఁ బిల్చెడువారి పథశ్రమంబులన్
దలచినవేళ తధ్వనులు తాకెడు సౌష్ఠవ మభ్యసించు మా
తెలివిని స్వర్గసౌధముల తెన్నునఁ బోవఁగనిచ్చి యందులో
వెలుతురు జేర్చితేని నది విశ్వము చూచు వచించుసర్వమున్. 154

ఉ. గీఁతలుగీసి గుండ్రముగఁ గేంద్రముజేసిన దృష్టిచేత నీ
చేతము నిల్పితేని కడువిత్రముగాఁ గనిపించుదృశ్యసం
జాతము స్వప్నతుల్య మది జాగ్రతయందు ఘటించు నందులో
భూతభవిష్యదర్థములు బోల్చగవచ్చు జనంబు కోరినన్. 155

ఉ. గీఁతలునడ్డముగ గీసి దృగంచలమందు బెట్టి యో
దో తనరూపుచూపునకు దోఁ చెడురీతిని కేంద్రమైన ; దృ
గ్పాతములోనఁ జూచును నిగారపుతెల్వి మరల్చి యామహా
ఖాతరసార్ణవంబునఁ బ్రకంపితమై దివిఁగానవచ్చెడున్. 156

ఉ. ప్రాకటమైన జ్ఞానపథపద్ధతి కొంత విచిత్రరీతులన్
గైకొనవచ్చు నీనిజము కాదనరాదొక చంద్రహాసమున్
జేకొని సాధకుండ తనచిత్తము శాంతసమాధినుంచి యా
లోకన చేసెనేని తనలో వెలుఁ గొక్కెడ మోసు లెత్తెడున్. 157

శా. ఏదే నొక్కరహస్యమున్ దెలియఁగా దృష్టిన్ బ్రదీపించు నిం
కేదేనిన్ గని మాటలాడునెడలన్ హృద్వీథినావస్తు వా
పాదింపదగు దానిలోవెలుఁగు సంపాదించి నోరిచ్చి నీ
వాదారిన్ జని పల్కరించు మది స్వేచ్ఛాసక్తి భాషించెడున్. 158

ఉ. ఏదియురాదటంచు నెద నేయది రోయకు దానియందె నా
మోదము లక్ష్యముంచి పొరపొచ్చెముమాని పఠించితేని నీ
కేదయినన్ లభించును నిదే జడతత్త్వరహస్య మిందు జ
న్మాదిపురాకృతైక సుకృతార్థ మగత్యముగాదు చూడగన్. 159

ఉ. ఆపదలందు తప్పుకొనునట్టి పథంబులు కొన్నియున్న వా
రూపములన్ని జెప్పునెడ రూఢిగ నమ్మరుకాని లోకమం
దాపరతత్త్వమున్నది యథార్థము నాపదగల్గునప్పు డా
యాపద కష్టపెట్టునని యార్తిఘటించిన రావు కష్టముల్. 160

చ. మనసును గట్టుటన్న దొకమాటయెగాని మనస్సు నెట్లుక
ట్టునొ వవియింపరెవ్వరు నటో యిటొ పొఱెడుదాని కట్టుట
న్నను చలియించుటే రసమునన్ బసరుంచినఁ గట్టురీతి నీ
మనసు సుషుప్తిమైకమున మార్చుము కట్టును మాటాలాడకన్. 161

ఉ. చూఁడు సుషుమ్నవిప్పుటకుఁ జూట్కులు మున్నొకచోటఁజేర్చియా
నాడిని ముందరన్ నిలిపి నాల్కను నోటికిమధ్యనుంచి వె
న్నాఁడెడు హంసతో సగమునంటుచు మింటిని జూచిదేని యా
నాఁడు నిజప్రకాశము గనంబడు నీవదియంచు నమ్మఁగన్. 162

చ. మనసు చలించునప్పు డది మాన్పఁ బ్రయత్నము చేయరాదు న
వ్వను వ్యసనంబులో మనసు పోయినతీరునఁ బోయిపోయి యా
మనసు మరల్పఁగావలయు మంచిప్రసన్నతఁ గాంచి నిల్చు నా
వెనుక త్వదీప్సితార్థ ఫలవిశ్రుతి నిచ్చు కృతార్థపద్ధతిన్. 163

ఉ. దండకమండలంబులు ప్రదర్శితమైన జటావశేష దో
ర్దండకషాయచేలములు దాల్చి తపస్సుననిల్పి చూచు బ్ర
హ్మాండము నీనిశీధితెఱ కావలమాటయియున్న వెల్గు నీ
కుండలి శింశుమారమునఁ గూర్చినఁ గానఁగవచ్చు నేయెడన్. 164

ఉ. తావశముల్ తపస్సునకుఁ దావల మైనవటన్నమాటలో
భావము తెల్ల మెల్లరకు స్వర్గము నాయమృతంబుదేవతల్
కావలెనన్నఁ బెద్దయధికారము కావాలె నందు శక్తిపీ
ఠోవును గాన ఖడ్గమొకటంచుతపస్సున జ్ఞానసిద్ధికిన్. 165

ఉ. నీవని నీవుగా నెఱిఁగి నీయెడ సంశయ మొందకున్న నా
నీవు చరాచరంబయిన నీశ్వరరూపమునందు జేరు నా
భావములోన నీవను ప్రభావము వెన్నెలుగాఁగఁజేసి యీ
స్థావరజంగమాత్మక నిశాసదృశంబులు మార్చు నీవుగన్. 166

మ. అది నీ వైతివటన్న ప్రామినికు వ్యాఖ్యానంబు బ్రహ్మంబుగాఁ
గఁడురన్ జెప్పెడు తర్కముల్ వినిన నీకున్ శాంతి నీఁజాల వె
య్యది యూహింతునదే త్వమేయముగ నీవర్థించితే యారసా
స్పదమౌవస్తువు నీవుగాంతువు పరబ్రహ్మంబుగా సర్వమున్. 167

చ. వెలుఁగును జూచి యా వెలుఁగు వెన్నెలకన్నను తేటుగాఁగ నీ
వెలుఁగునఁ బోల్చి యావెలుఁగు వెళ్ళినమేరకుఁజూపు నిల్పి నీ
తెలివిని మాటుచేసి యటతేటగఁ దోఁచెడు బాటలోన నీ
వలయకపొమ్ము విశ్వమున కవ్వలిస్వర్గము దోఁచునచ్చటన్. 168

చ, తెలిసినసద్గురుండు తనతేజము శిష్యుని వైపు పెట్టి ని
ర్మలినవికాసరూపమున మాయనుమాయనుజేసి చీఁకటిన్
దొలఁగఁగఁద్రోసి యాత్మ తనతోఁ జనుదేరఁగ మూఁడులోకముల్
వలగొని దేహబంధములు వాయ ముముక్షుని సేయు నెంతయున్. 169

ఉ. నాలుగునాళ్లు రొమ్ము వదనమ్మును జేర్చి నిరాశఁగూర్చి కెం
గేలనమర్చి శాంతమతి స్రొక్కుచు సోహముపాడెనేని యా
బాలున గుండెకొట్టుకొనఁజాలును దానినె చక్రషట్కమం
దోలవముంచితంచు స్పృహనుంచిన పూర్ణసమాధివచ్చెడున్. 170

ఉ. మేనుసగావలక్ష్యము నిమీలితలోచనుఁడై నిగిడ్చినన్
జ్ఞానసమాధిలో మనసు గట్టినతీరునఁ గట్టివేయు నా
ధ్యానము శూన్యవిశ్వము లయంబయి చీఁకటిపోయి తేజమున్
గానఁగవచ్చునం దమృతగానము నీదని యాలకింపుమా. 171

ఉ. రెండనితోఁచు నీజగము తేపునుమాపును నొక్కరీతిగా
నుండుమ దీనిలో నొకటియున్న నిజంబు వెలుంగకున్న నీ
రెండు నశాశ్వతంబులయి రిత్తయిపోవునుగాన నీవు బ్ర
హ్మండముగాఁ దలంపుము ననాత్మకుదావిడఁబోకు మేయెడన్. 172

ఉ. అది నిజమైననేత్రము‌ల నాత్మపథాన మరల్చిచూచినన్
హృదయకవాటముల్ తెఱచి యిద్ధతమస్సును మీఱి సత్ప్రకా
స్పదమగు తేజమున్ వెలికి వచ్చును నానిజరూపె తానుగా
సదములసత్సమాధిని ప్రశాంతమతిన్ గనుచుంద్రు సాధకుల్. 173

ఉ. కనపడు నెల్లవస్తువులుగాఁ దనుమార్చి సమస్త వస్తువుల్
తనవలెఁ జూచుసాధనమె తత్త్వరహస్యము నాయనంత దృ
ష్టిని సచరాచరం బయినసృష్టి నిరూఢ మెఱుంగవచ్చు నా
త్మను గనుయోగికియ్యదియెమార్గము నీశ్వరరాజ్య మేలగన్. 174

తే. గీ. అట్టిసాధనలెల్ల వా రరయలేక
వామమార్గాలఁబడి పెక్కువాదములను
సలుపుచుందురు తనత్రోవఁ దెలియఁబోరు
ఎల్లమర్మాలు తనలోన యెసఁగు గంటె. 175

## లక్ష్యము

శా. నిన్నున్ జూచెడుకోర్కె యున్న నెదలో నిర్నిద్రతేజంబులై
యెన్నో మార్పులఁజెంది నీయెదుట నెం తేనిల్చు లీలాకృతుల్
భిన్నంబై యొకవ్యక్తి దాల్చియు భవత్ భ్రూమధ్యతేజంబులో
నున్నానంచు నెఱుంగనేర్తువు మహోద్యోగంబు సంధిల్లఁగన్. 176

శా. నిన్నున్ జూచెడికోర్కెయున్న నెదలో నిర్నిద్రతేజంబు రా
గోన్నత్యంబు ఘటింపఁజేసి యదినీవై నిన్ను బ్రహ్మాండమం
దెన్నో రూపులుగాగ మార్చునెడ నందేదోత్వదీయాకృతిన్
భిన్నంబై కనవచ్చు నీశ్వరునిగా భ్రూమధ్యభాసిల్లునున్. 177

ఉ. ఏకటియందె సాధకుఁడు సృష్టిసమస్తము నైంద్రజాలకుం
డేకముఖానఁ జూపుగతి నీశ్వరరూపమహాపదార్థముల్
లోకములన్ని చూడఁగల లోచనముల్ గడియించునట్టి య
స్తోకతపస్సమాధి ని వి ధూతమలీమసులౌదు రారయన్. 178

చ. వ్యయరహితంబు మానసికమైనవెలుంగు తపస్సమాధిలో
నయనములారఁ జూచుచు ననంతమహామహితప్రపంచ మే
దయి యిటు రూపమేర్పడ మహాద్భుతలీల నటించుచున్నదో
స్వయముగ నాపునాది గనవచ్చును బ్రహ్మముగాఁగ సర్వమున్. 179

శా. నీలోనున్నని పంచభూతములు వానిన్ దీక్షలోఁ బట్టినన్
జాలున్ లోకము కాలమున్ మృతియుఁజంచత్ ద్వందసామగ్రి పోఁ
జాలున్ జీకఁటివిచ్చు నీమనసులో జాజ్వల్యమానంబు నెం
తే లావెక్కు స్వతంత్రుఁడీవనుచు నీవే సృష్టిగా నెంచినన్. 180

ఉ. చిన్నవి నైచ్యభావములఁ జెండ కజాండము బట్టుకొమ్ము నిం
దున్న మహత్పదార్థముల నొంచి స్వతంత్రనించి యీశ్వరుం
డున్న కవాటముల్ తెఱచి నుజ్జ్వలరూపరసానుషంగ సం
పన్నత నీమహామహిమఁ బర్వఁగ సృష్టిని నూఁపివేయుమీ. 181

చ. ఉరుములు కందరంబులు మహోదధులంబుదముల్ నదుల్ వనుల్
తరువులు గాలిచేఁగనలి తాత్త్వికమైన ప్రసన్నగానసం
భరితరసాప్తినించి తమవాఙ్మయ మేయెడ పాడుచుండు నా
తెఱవులు తార్కికంబులగుతీరులెఱుంగుచుఁబుచ్చకాలమున్. 182

ఉ. ఏటికి వట్టివ్యాసములు నేమిటియున్నతుక్కు దానిలో
బాటుపదార్థవాద మగచాటులఁ బెట్టుచునుండు తార్కికా
ర్భాటముచేతఁ జేతమును భంగమొనర్చకు వారిఁజేరి నీ
వీటిని మాటలాడునదె విశ్వసరస్వతి నాలకింపుమా. 183

ఉ. నీవనుమాట తీసి యట నీవయినట్టి పరాత్మతత్త్వమున్
దేవునిగాగ్రహించి తనతేజమె సృష్టి కదల్చినట్లుగా
నావల నొక్కచిన్నలవమై యణువై 'అహ మస్మి బ్రహ్మ' మం
చీవసుధావృతాంధతమసీగతి దాటినరీతి నెంచుమా. 184

ఉ. ఏది వచింపనేర్తు మనసే యగుపించ దటంచు చెప్పెదీ
వేది యెఱింగిచూచెద వదే మన నీసచరాచరంబు నీ
లోదె సుషుప్తివీఁకటులలో మనసుంచిన స్వప్నమౌను యా
వైదముదృష్టి నొక్కయెడఁజాఁచినఁ జూడఁగవచ్చు స్వర్గమున్. 185

ఉ. మాటలలోన నీమఱుఁగుమాటలు చెప్పుట కష్ట మింద్రియా
రాటము మాని మాకసికరంధ్రములోఁ గనుచూపుఁ బెట్టు మ
చ్చోట సుషుమ్నలోఁ బ్రణవశోభితమైన వెలుంగుదోఁచు న
చ్చోట సుధాస్రవంతి దివిజొచ్చి సుషస్సునుగాంతువీవుగన్. 186

ఉ. మాటలలోన నీమఱుఁగుమాటలు చెప్పుట కష్టమింద్రియా
రాటము మాని మానసికరంధ్ర మథోముఖమందు నున్న దా
బాటను నొష్ట నేల నిడి స్వర్గముదాఁకను బోవవచ్చు న
చ్చోట సుషుమ్నలోవెలుఁగు జూచుచుఁ జూడుమునిన్ను నీశ్వరున్. 187

చ. జడములయందు నీకుఁగల సౌఖ్యము స్వర్గమునందుఁ బెట్టి క
ట్టడి విషయాభిలాషివయి డాంబికమార్గమునందు కాలమున్
గడపకు గోచరంబులను కాండపటంబున దాఁగియున్న యా
కడలివెలుంగువీచికలఁ గాంచుము స్వర్గము గోచరం బగున్. 188

చ. మిణుఁగురుపుర్వు వెల్తురున మేరువు నెక్కఁదలంచువారి నె
మ్మనముల లోపమున్నది తమస్సును జింపి స్వతంత్రశక్తిచే
ననలము చంద్రసూర్యుల రథాంగముగా నడిపించిపోవు నా
యనము నెఱుంగు మద్ది తనయందు లయంబగుదృష్టి గన్పడున్. 189

ఉ. నీవును నీవయై మఱచి నిద్రమునింగినవానిభంగి నీ
భావముమార్చి యందు రసవత్తరమైన సమాధి స్వప్నతు
ల్యావృతమైన దృశ్యముల నంతముగాఁ గనుపించు నందులో
నీవును గానుపింతువదె నిక్కమునైనత్వదీయరూపమున్. 190

ఉ. రాతినిబొమ్మఁజేసి ప్రియురాలనుగాఁ బలికించినట్టుని
శ్చేతదముల్ జలించుగతిచేయు చలత్ ప్రకృతిస్వరూపసం
జాతము దృక్కులన్ నిలుపఁజాలినవాని నిగూఢతత్త్వసం
ఘాతము చేతిలోను సిరికన్ బురుడించును జ్యోస్యమాడఁగన్. 191

ఉ. రాతినిగల్గు నిప్పునుపరాయిడిచేత వెలుంగునట్లు నీ
చేతమునందు నీశ్వరుఁడు సిద్ధతపోమహిమన్ వెలార్చునీ
రీతినెఱుంగలేక బహురీతుల బాధలనొందనేలనే
లా! తనరూపులో బయలునందు సగంబయి చూడరాదొకో. 192

మ. నిదురన్ మేల్కొనుచుంటివీ మెలకువన్ నిద్రించుచున్నట్టునీ
యెదలో చీఁకటిజాగ్రతల్ వెలుఁగునెంతే నిద్రలోనున్నదా
పదమున్ మార్చుటయే సమాధి పవనున్ బంధించివీక్షించు నె
య్యదొ యామోక్షపథంబు నీవుగను బ్రహ్మానందవారాశివై. 193

చం. మనసొకచోటలగ్నమగు మార్గమె జీవసమాధి యందులోఁ
దనులకుగోచరించినదె కాఁగలదృశ్యము వానిపోల్చి నీ
వను మహనీయశక్తినిజహానిని జెందఁగనీకవ్యక్తి ని
ల్పినఁ దనుతాను గాంచుటవలీల ఘటించును యౌగికంబుగన్. 194

ఉ. మున్నవరోధమైన నహమున్న శయింపఁగనిమ్ము చూడుమా
తెన్నున నింద్రియమ్ములు గతింపఁగనిచ్చి గురుస్వరూపమం
దెమ్మెయినైక్యమై ప్రకృతి నీశ్వరునందులయంబుజేయుమీ
వున్నయదార్థమందు వెలుఁగున్నదియయ్యదె రూఢమన్నిటన్. 195

ఉ. మానవజీవితంబనెడు మట్టిని మట్టిని గల్పివేసి వి
జ్ఞానముచేత సృష్టిని ప్రకంపితమున్ బొనరించి యందునీ
వైన మహాపదార్థమె చరాచరముల్ నడిపించుచున్నదం
చా నిజదీక్షలోవెలుఁగువై యమృతత్త్వముగాంచు మెంతయున్. 196

ఉ. ఆరవి యానిశాకరుఁడు నాయుడువర్గము స్వర్గధామమోం
కారము దేనిలో నణఁగి కాంతివహించు తదీయతేజమం
దారయఁగా సుషుమ్న యను ద్వారములోపలనుండి రూఢమై
తేరి చరాచరంబయిన దీప్తివహించు ప్రశాంతదీధితిన్. 197

ఉ. అన్నియు నీవెయై యెసఁగియన్నిటియందున నిన్నుజూచి నీ
వన్నిటికన్న మేటివనునట్టియదార్థము మాఱకుండ నీ
కన్నుల దృష్టి నీవయిపుగా మరలించి శరీరమందు నీ
వున్న తలంబుమార్చి గనుగొన్నను నీవనురూపుదోఁచెడున్. 198

ఉ. ఆకసమంతరాళము బయల్‌పడియున్నది దీనియందు మే
ఘాకృతినున్న యీ ముసుఁగు కవ్వలనేమిటియున్నదోయథా
లోకనతత్పరత్వమున లోచనముల్ నిగుడించితేని
కాకలనంబునాకమమరావళియున్ గనవచ్చుసొంపుగన్ 199

శా. వామాచారము నీతిబాహ్యము నసభ్యత్వంబు వర్జించి వి
ద్యామర్యాదను సిద్ధయోగముల నభ్యాసంబు గావించితే నీ
ఆమార్గంబులభించు నాతెలివిలోఁ జూపట్టు విశ్వస్వరూ
పామార్తాండఖగోళరోదసికనత్ స్వర్గైక పాతాళముల్. 200

శా నీలోనున్నవి లోకజాలములు మున్నీనుండి బాహ్యంబుగా
నాలోకించెదవేల ! వీనికి స్వతంత్రాభీష్టవృద్ధిక్షయా
భీలంబైన స్వశక్తిలేదరయహృద్వీన్ ప్రపంచించినీ
వాలోకంబునఁ జూడనేర్తువదె బ్రహ్మానందసంధాయివై. 201

చం. ప్రణవముపాడుచున్ హృదయవాసనలన్ గదలించివైచి నీ
వణగిన నాసుషుమ్నలవమైనను వెల్తురువేతఁ బెద్దదై
కనపడు తత్ప్రకాశమునఁ గానఁగవచ్చును నీవు నీశ్వరుం
డనునమృతస్వరూపముల నాహతమందునభంబుదోఁపఁగన్. 202

ఉ. బాలుఁడు మాటలాడుటకుఁ బాల్పడునవ్వుమనస్సులోన నే
వేళకు నేదితోఁచునది వెల్లటిసేయునుగాన నీవునీ
ఫాలము నేలమోపిగనవచ్చెడుత్రోవకుఁ గన్నులెత్తిపోఁ
జాలిన జీవు నీశ్వరునుషస్సును సృష్టిని చూచెదాయెడన్. 203

ఉ. ఆదెస మబ్బులున్ మెఱపులందు తళుక్కునఁదోఁచువెల్గు నీ
రోదసిబట్టి నిల్పు మవరోధమరుత్ హఠయోగసిద్ధి సం
ప్రాదితమైన మానసికశక్తిని కేంద్రముజేసి యాజవో
త్పాదితమైనదీక్షను నుపాసనఁజేయుము నిన్నుగాంచఁగన్. 204

ఉ. చూఁడుమటంచు విశ్వమును జూపెఁగిరీటికిఁ గౌరవారికిన్
నాఁడుమురారి యాములుఁగునారయుదేని మనంబు దృక్కులన్
దోఁడయిరాగ నొష్టపయి తోఁచువెలుంగుకలంగకుండ నా
వేఁడినిచూచెదేని యట విశ్వముజూడఁగవచ్చు రూఢిగన్. 205

చం. మనసునశక్తి యున్నదది మాయనుగూడివికల్పభావసం
జనిత వికారవీచికల సాగును దానినిబట్టి మంచిసా
ధన సరియైన మార్గమునఁ దద్దయునిల్పి యనల్పకల్పనా
ధునిక విచిత్రదృశ్యములు తోరణఁగట్టఁగవచ్చునిచ్చలున్. 206

ఉ. ఊహలకందరానిది సముజ్జ్వలమైనది బ్రహ్మతత్త్వము
త్సాహసమన్వితంబును ప్రశాంతామునైనతీక్ష్ణచేత సం
దేహము బాసినేననెడు దీక్షచరాచరమందుజేర్చి వ్యా
మోహముమాని చూచునెడ ముందరఁగాంతువు విశ్వరూపమున్. 207

ఉ. ఈసముపాసితంబయిన నీశ్వర తేజము భూమినిండికై
చేసి ప్రశంసపాత్రముగఁ జేరుచున్నది స్వర్గమందిరా
వాసముదాఁక నావెలుఁగు వాసనలెల్లవెలార్చి జీవితా
భాసమునందు నేననెడు భావము సిద్ధముజేయుమెంతయున్. 208

ఉ. ప్రాణమువంచి యింద్రియపరంపరలన్ దిగజార్చిపూజలో
మేనుకుఁదిర్చి దీక్షను నిమాలితలోచనుఁడై సమాధి వి
జ్ఞానముగన్న యోగి తనకన్న మహత్తరమైనదేదియున్
గానఁడు తన్నెగాంచినుము కాంచనమైనతెఱంగుపూర్ణుఁడై. 209

ఉ. ఈగతియోగమార్గములఁ నెంతయునేర్చి పరాత్మకాత్మకున్
యోగవియోగయానముల నూర్ధ్వముఖంబుగఁ బోయి వానిలో
దాఁగినమర్మముల్ తెలిసి దక్కిమనస్సునకున్న పగ్గముల్
లాగిదివిన్ గతాగతములన్ భగవంతుని జూడనయ్యెడున్. 210

## — నిస్పృహ —

ఉ. ఏమిటి మత్తునాకు నిది ఏమిటిమార్పు నిశాంగనాతమో
ధామముపీడి యాప్రణయ ధన్యప్రభాతశరాన నన్ను నా
ప్రేమ కవాటముల్ తెరవి విహ్వలఁజేసి రసానుభూతి న
య్యోమయి కానఁబెట్టి నిది యూహలకందునె యెన్నినేర్చినన్,

ఉ. ఏమిటి ఛిమ్మచీఁకటది యేమిటివెగ్గలు వియద్ధునీజల
శ్యామలమైన మబ్బుతెర చాటునమింటిబయళ్లమధ్యసౌ
దామినులన్ బ్రదీప్తమగుధామములన్ విహరించు నాజన
స్తోమము లేమిటో యదియెసుమ్ము యదార్థజగంబు జీవికిన్. 211

ఉ. ఏమిపరాత్రి యాపగలదేమిటి మింటను మేఘపంక్తిసో
దామినులందు నిప్పులు ముదావహమైన ప్రభాతవాతసం
ధ్యామయమైనసృష్టి మరియాద నెఱుంగఁగరాదు దీనిలో
ఏమి రహస్యమున్నదో యదే కలకై వడి జూడ నయ్యెడున్. 212

ఉ. శూన్యము పంచభూతములఁ జూపుచు నున్నది దీనియందె సా
మాన్యముగా జరామరణమార్గము లన్నియు గల్గుచున్నవీ
శూన్యము గొప్పశక్తిగలచోటు నిజంబుగ దీనియందు న
న్యోన్యతఁగన్న నీశ్వరుని యోలగమున్నదిగంటె నీవుగన్. 213

ఉ. మేను సమాధిలో నిడి నిమీలితలోచనుఁడై విధూతక
ర్మానలమున్ బ్రశాంత మమృతాయుతమైనతి తీక్ష్ణయోగికా
నూన మనోనివేదనము నూల్కొనుదృక్పథమందు చీఁకటుల్
కానఁగరావు ఆతెరవు గాంచియు గాంచుము నిన్ను నీశ్వరున్. 214

శా. ఏదో పెద్దనిగూఢమైన నిజమిం దేదో ప్రదీపించు నీ
యాదర్శైకరసాత్మకప్రకృతి నధ్యాహారమం దీన్నృత
ప్రాచుర్యాభవము గల్గుచున్నది జగత్సామాణ్యమందాస్తికో
ద్భేదంబైన నభౌతికప్రకృతి నుద్దీపించు తత్త్వంబునన్. 215

శా. ఏదో పెద్దనిగూఢమైన నిజమెంతే తోఁచు సధ్యాత్మనా
పాదోరాశి తరంగవేగములచేఁ బాతాళమున్ జొచ్చి యం
దేదో జ్వాలగ నావరింప నభమం దేతెంచి విశ్వంబు దా
నై దివ్యామృతమోక్షధామములు సంధ్యారాగమందారయన్. 216

ఉ. అరసిపంచభూతములయందు లయంబయిపోయినట్టి ని
ష్ఠారతిదృక్ప్రపంచకముసంగతి నే మొదలంట వీడి వి
స్ఫారమనోవికారములవంకనుబోక యసంగుఁడై తమో
ధారణఁడంచునెంచు నిజతాత్త్వకుఁడేకను తన్ను నీశ్వరున్. 217

సీ. అణువులలోదూరి యాకాశమైమాఱి
చుక్కలలో తొంగి చూచుచుండు
పుష్పంబుగాఁ బూచి పుష్పోడియై లేచి
సౌరభంబులఁ దోఁగి సాగుచుండు
మేఘాలగర్జించి మెఱవులఁబరతెంచి
మిన్నేరులను బాఱి మెఱయుచుండు
దీర్ఘి కావశిగ్రాలి దిక్కుంభికుంభాల
నెక్కినాట్యముచేసి యెసఁగుచుండు

తే. గీ. ఇట్టులొకటియేమిటి యజాండాట్టహాస
భాసమానమహానందపదమునందు
బొదలి రోదశీకుహరాల భోరుమనఁగ
కదిపివేయును జ్ఞాని విజ్ఞానకళను. 218

ఉ. కాపురుషుల్ గ్రహింపరు వికావిక నీ తెఱగాత్మసాధనా
ధ్యాపకమైన తాత్వికవిధాన పరంపరలందు నీవునీ
రూపముబెట్టినప్పుడు పురుంగును తుమ్మెదతెచ్చి బంభ్రమోఁ
ద్దీపితగానమున్ సలుపుతీరున సోహము పాడఁగావలెన్. 219

శా. ఆలాకర్మల గోడువీడిన శిఖాయజ్ఞోపవీతంబు లిం
కేలా ! యౌగిక మానవంబులను నెంతేద్రావి మైకాన నీ
బాలోన్మత్తపిశాచ భంగి నభమున్ వర్ణించుచున్ బాడుచున్
నీలోఁజూడుము నాలకించుము మనోన్వేషంబులో బోధ్యమున్. 220

## అవధూత

గీ. మేము చేర్చిన భాండార మేమి లేదు
పక్షి గూడల్లుకొనగ గడ్డిపరకలట్లు
భావరసవాహినీ వీచికావిలాస
లాలసంబుల వెన్నాడి ప్రాలుమాలి. 221

ఉ. తాను నిరీశ్వరుండయినఁ దాత్వికుఁడైనను తానుగన్న వి
జ్ఞానముచేత బ్రహ్మనని చాటుచునుండె నిరీశ్వరత్వమె
వ్వానిదొ తోఁచిపోఁయెనిఁక వాదములేటికి నున్నదంత తా
నైన యదార్థమందు కలదంచు తలంచు తపస్విముగ్ధుఁడై. 222

ఉ. నీవనువ్యక్తి చంపుకొని నీశ్వరుఁడా! యని యేడ్చువాఁడు కా
లావధిబంధితుండయి హతాశుఁడుగా నశించియించిపోవు నా
త్రోవజడత్వమైన దపరోక్షముగా హరినెంచువాఁడు తా
నే వివిధావకాశములనెత్తి ఫలాప్తినిఁ గాంచు నెంతయున్. 223

ఉ. ఏరునిరీశ్వరుల్ కలుషమేదియు జేసినయట్టులేద వే
ఘోరములైన నీశ్వరుని గొల్చెదమంచనువారెవేయుచు
న్నారదియేమొనైతికమనన్ దెరఁగట్టి; నిరీశ్వరుండు నా
తీరునఁబోడుడాంబికులఁ దిట్టుహసించు తపస్సమాధులన్. 224

చ. మధువును ద్రావిత్రావి యలమైకమునందు విధూతవాక్సుధా
మధురములైన సత్కవితమార్గములన్ దలపోసిపోసి యా
పథికుఁడు సృష్టిలోపలి ప్రభావములన్ గనునట్లునీవు నీ
పథమునఁ దత్త్వమున్ దెలిసి పాడుమునీ స్వకపోలగీతముల్. 225

ఉ. ప్రార్థనఁజేసిచేసి పడరానిశ్రమల్ పడిపొందుచున్న నీ
నిర్ధనమైనసంగతికి నేరనిరీతికి వింతతోఁచువా
గర్ధముభంగి ప్రార్థనమహాఫలమియ్యనిదేని యెలనీ
స్వర్ధుని నమ్మఁబోకు నిజసంగతివేర్చితటంచు మూర్ఖతన్. 226

ఉ. రాజ్యముచేయుచున్న మఱి రాలనుమోయుచు బానిసీలవా
ణిజ్యము చేయుచున్నసు తృణీకృతభద్రపురందరుండవై
వ్యాజ్యముమాని మానసము ప్రాప్తములైన ఫలాప్తి తృప్తిసా
మ్రాజ్యముగాఁ గనమ్ము మదిరమ్మును త్రావినవానిపోలికన్. 227

ఉ. మేము తపస్సమాధులను మేల్మొసుగుల్ పెకలించి మింటిసౌ
దామినులందు వెన్నెలల తళ్కులుబుట్టు మెఱుంగువెట్టి స్వ
ర్ధామము తొంగిచూడఁగల దారులుచెప్పి నిశాకవాటముల్
వ్యోమమునందె విప్పినటులుంచితి మాదెస వేగుచుక్కలన్. 228

ఉ. మమ్ముపదార్థవాదులు ప్రమాదపథంబున జ్ఞానమార్గముల్
నమ్మఁగఁజెప్పువారని మనంబునఁ దిన్కవహించి తిట్టఁగ
నెమ్మెయిరాకుఁడో నెఱసులేఁటెడు పాఠకులారా మీరు యో
గమ్ము తపస్సమాధుల మొగంబు లెఱుంగరు వేయినేర్చినన్. 229

ఉ. నీచదువెంతపాటిదది నేర్చిన నేర్పుకయున్న నీజగత్
గోచరముల్ మఱుంగుపడి తోఁచనిచోటు నెఱుంగఁజెప్పలే
దీచషకానమైకమిడ నెంచనిసీధువుద్రావెదేని దో
బూచిని చేయునిన్ను పరిపూర్ణత మానవులందు గల్గునే. 230

ఉ. అన్నముమాని వత్సరములైన వసింపఁగవచ్చుగాని మే
తెన్నన నిద్రమాని విమతిన్ బ్రతుకంగలవారు లేరు ని
ర్భిన్నసమాధినెట్టె నిదురింపకతప్పదు వేల యేండ్లనీ
కన్నులఁజూడుమీ యిహముకన్న మరేమియులేదు మోక్షమున్. 231

శా. ఏదోయున్నది దానితీరుమనకే యేతీరులన్ బట్టుకో
రాదె దాని రహస్యమిట్టి దని నిర్మానుష్యమైనట్టి యహా
యాదిత్యేందు ఖగోళచక్రముల మృగ్యంబైన స్వర్గాది ప్రా
సాదంబుల్ కనపర్తు రేటికవి విశ్వస్థంబు వర్జించినన్. 232

చ. బ్రతికెడుకొన్ని నాళ్లు నుపవాసములన్ దెగమాడెదేల యీ
బ్రతుకునశించితే తిరిగి వచ్చెదవే యిది యారగింప ను
ద్వితమతి నున్న నాళ్లనుభవింపుము హాయిగ విశ్వవస్తుపాం
ఛితములు లభ్యముల్ విధినిషేధములేమిపవిత్రుఁడౌ నెడన్. 233

చ. ఎవరిని గొల్చెదీ వచట నేమియులేదు ప్రపంచమెల్ల నీ
యువిదనుబోల్చి యామె వివిదోర్ధ్వజగంబులుగాఁగ నెంచి యా
ప్రవిమల తేజమందు జడభావముపెట్టక చూచెదేని యీ
రవియు సుధాకరుండు దివి రాజిలుప్రేమరసాననైక్యమై. 234

మ. మధువున్ మానినులున్ వనావళి నదీ మార్గాలసౌధంబు లా
విధి స్వర్గాన రచించెనన్న నవి యీ విశ్వానలేవే; వృథా
పృథుయజ్ఞాది తపస్సమాధులు తదావిర్భావమున్ బాపఁగా
కథలన్ జెప్పి మరల్చినారము మమున్ గారింపఁగాఁబోకుఁడీ. 235

ఉ. ఎప్పటికైన మేము జగదీశ్వరునిం గని స్వర్గసౌధముల్
చెప్పుల నెక్కిపోయి యట చిత్రము లారసివచ్చి మీకడన్
జెప్పెడు నాసలేదు, ప్రహసించిని మ్రొక్కిన నాత్మశుద్ధిలోఁ
దప్పులులేవు నాతిరుగుఁదారి వచింపఁగ రైరి యెవ్వరున్. 236

ఉ. మీరునిరీశ్వరుండ నిగమించెఁడు వాఁడు నిషిద్ధ జీవనా
కారమలీమసంబయిన కష్టములన్ నివసించి యెప్పు డె
వ్వారిని హింస సేయఁ డభివంచిత మౌచషకానసీధు వే
సారసనేత్రొ నవ్వుచు నొసంగనదే దివి యంచు నెంచెడున్. 237

ఉ. ఆవిరిఁబోఁడి నవ్వి వికచాకృతి వెన్నెలఁ దెచ్చిపెట్టె నా
హా! వెలలేని యానగవునం దవె రాలెడు మౌక్తికంబులా
జీవముగన్న చిత్తరవు చీరముసుంగున స్వర్గతేజ మెం
తో విరఁజిమ్ము పోషుగము తోరణఁ గట్టిన యట్లు చూచితే. 238

ఉ. నీవిడుచున్న నీసుఖపు నేసు గ్రహించుట కేమివింత నీ
వావల కేగితేని యిడు నంబుజనేత్ర లభించకున్న
భావము బంధమై మతిని బట్టి యధోగతిదెచ్చి పెట్టదే
దేవి యిదే ప్రమాణమని తెమ్ము ప్రమోదముతోఁడఁ ద్రావెదన్. 239

ఉ. బైక్షికమైన నీమధువు పాత్రనుబోసి యొసంగు చుంటి వే
జాక్షిత్వదీయ రాగరస మందిది యెన్నవపాలు నీ సుధా
ధ్యక్షవిలాస వైఖరుల హర్నిశముండునె జారిపోత నీ
దీక్షతపస్సుకన్నఁగడు తియ్యని కైపిడుచున్న దుగ్మలీ. 240

ఉ. అన్నిటియందు జీవుఁ డలరారును పానసఁ జేసెనేని నీ
కన్నుల కిట్టిగోచరముగాంచును వానిని మానవాకృతిఁ
గన్నవిధానమాటలను గల్పిన స్వేచ్ఛగమాటలాడు నీ
తెన్న వధూతకాలమతి తృప్తినిబుచ్చు జగంబు తానుగన్. 241

చ ఒకయెలజవ్వనిం గనిన యోగివిశీర్ణవి ధూతరాగదో
ర్వికృత మలీమసాప్తివివరించును ; లంపటుఁడా మహాసతీ
ప్రకృతి తదేకదీక్ష తన పాటల నీశ్వర తేజ మందులో
నొకయణువైన కాదనుచు నువ్విళులూరు రసాను భూతికిన్. 242

ఉ. శోకము మోహమున్ దవిలి శూన్యములోని యగాధసత్యమా
లోకనసేయ నెంచి పరలోకముపైఁగల యాస వీఁడకే
వ్యాకులమంది పామరుని భంగి వృథాభవదీయ జీవితా
నీకము పాడుసేయకుము నేరిచి ప్రేమరసంబు ద్రావుమీ. 243

ఉ. సంగమసంగతంబయినసంగతి శూన్యమునందు వెల్లు వ్యా
సంగముచే గ్రహించి నిజసంగతియందు లయంబునొంది స్పృ
ష్టింగల ప్రేమసీధువును చేరలఁ ద్రావుచు సంతసించు మా
గౌంగళియందె యీశ్వరుని గోడునెఱింగితి మింకిదేటికిన్. 244

ఉ. మావెనుకేల వచ్చెదరు మాకడ నేమిటి నేర్చుకొందురో
పావనులార భక్తజనవందితులార నిషిద్ధమైన యీ
జీవితమున్ సమాధినివిశీర్ణముచేయఁగఁజూచుడి మాకు మీ
తోవగపేల అమృతులతో మము నెక్కడ లేచి పొండిఁకన్. 245

ఉ. మావలె మీరలేల కొఱమాలి ప్రమాదము దెచ్చుకొంద్రు మీ
దేవునిగొల్చి మీరు కడతేరుఁడు మేము స్మశానవాకిటన్
జీవిత మొప్పగా విధి నిషేధములన్ విడనాఁడిపోవు మా
త్రోవలు మీకు నచ్చవు నధోముఖులూర్ధ్వజగాన జూతురే. 246

ఉ. మేము పరిత్యజించితిమి మేలును కీడు సుఖంబు దుఃఖముఁ
సామములేదు సత్యము ప్రశాంతమహావిభవంబులేదు వి
ద్యామధుపానమత్తమతియై విహరించుచు మేఘపంక్తిసౌ
దామినిబోలె వీఁకటిలదాఁటి తమస్సుల నిద్ర లేపుచుఁ. 247

మ. హృదయద్వారము విప్పి తోఁచినది యేదే కాని నిష్కర్షగా
నెదుటన్ జెప్పుము సంశయింపకు పరోక్షేచ్ఛావిహారక్రియా
స్పదముల్ లక్ష్యము సేయ కేవనుమహావ్యక్తిత్వమునిఁ నిల్పుము
భృదయంబున్ క్షయమున్ గలాదె ప్రజలున్ భూషించినఁ దిట్టినఁ. 248

మ. అపవిత్రంబులు నింద్యముల్ వ్యసనదుఃఖాక్రాంతము స్మీలితా
ద్యపరూపంబులలోన నీశ్వరమహాధ్యాత్మైక తేజంబు నా
తప మ్యధాహ్నములన్ మలీమసములై దైవారు నెవ్వారుకో
రిపరిత్యాగము జేయలేరు హృదయోర్విన్ మండువేసంగిగఁ. 249

చ. జగమునలేని సౌఖ్యములు స్వర్గమునందు లభించునంచు నె
వ్వగఁదప మాచరించెద వుపాధిని బాసినసౌఖ్యమాకలన్
నెగడినయట్టులుండు నది నింద్యము లాయమృతత్త్వమైన సో
యగము రసస్వరూపమది యాసవమంగనలందు బోలదే. 250

ఉ. ఆసవమోనదీ పరిసరాటవి చారువధూప్రమోదవి
న్యాస విలాసలాలస మహామహితాద్భుతగానలాస్యమో
చేసి నివాళితో విధినిషేధములన్ విడనాఁడిభౌతికా
భాసరసస్వరూప సముపాసకుఁడో డెకృతార్థుఁడన్నిటన్. 251

చ. పగలు మనుష్యునన్ నిశలఁ బర్యునెడారుల రుద్రభూములం
దిరిగి జరించు సంక్షుభిత దృశ్యములన్ భయవిహ్వలంబులై
నెగడు జడత్వమార్చి మహనీయవిలాసరసైకమైన సో
యగములవంక నేర్పడెడు నద్భుత మోదమునొందు మేయెడన్. 252

చ. నీకును మట్టిబొమ్మకును నేమిటిభేదము జీవచేత నా
లోకన ముల్నదన్న నది లుప్తముజెందును మత్తుమందువే
సీకరణిన్ జరాచరము లేకముగాఁ గనుపించుఁగాని యే
దోకనుపించకున్నదదియుత్తదో మాయయొ ఈశ్వరుండెకో. 253

## సిద్ధులు

ఉ. హేమముసేయువారు రసమింగలమందు హరించకుండనే
మేమొ మహౌషధీశతము లేర్చినయట్లు రసస్వరూప వి
ద్యామహితాత్మప్రకృతికై తనలోనజడత్వమేర్చి ని
ష్కామసమాధిలో మనసుగట్టినవారలె సిద్ధులారయన్. 254

శా. గాలై వీచుచు ధూళియై యెగురుచున్ గల్పాంతకాలానల
జ్వాలై భూతములేర్చుచున్ రజనికాధ్వాంతంబు బోకార్చి పా
తాళంబున్ దివియున్ జలాపరములున్ దర్కించి శూన్యంబుగా
నాలోకించుచు తానె యీశ్వరునిగానర్థింత్రు యోగీశ్వరుల్. 255

ఉ. చినుకులు ముత్యమైననవి చేడ్పడిచిన్కులుగావు జీవుడున్
ఘనకర మీశ్వరాకృతిని గాంచినజీవుడుగాడుపుట్టుచున్
జనెడు జడత్వమున్ వదల జాలిననింక పదార్థవాదసం
జనితములైన పోలికలు సాగవతేంద్రియ మైనరూఢికిన్. 256

ఉ. నైతికమైనమార్గము జనంబులు మెచ్చిన బెక్కు చోటులన్
నైతిక బాహ్యవర్తన గనంబడుచున్నదికాన కొందరా
నీతినిమాని జీవితము నింద్యముగా గనవచ్చి యీశ్వరో
ద్భూతచరాచరంబయిన భూమినితాము యాక్రమించెడున్. 257

ఉ. మున్నలయాజ్ఞవల్క్యుడు నభోమణిలోపలిశక్తి లాగియ
భ్యున్నతి వేదమున్ బడసెనుర్వి శశాంకునిదింపి యీశ్వరుం
డన్నిటలో మహమ్మదు మహాత్ముడుచూచి ఖురాను దెచ్చెనీ
తెన్నున సాధకుండు తన తేజముతో దివి దింపు నేలకున్. 258

ఉ. చేరి యజాండభాండమున సృష్టివికాసములెంచియుంచి యా
భూరిప్రభాప్రపూర్ణ రసపూరిత వారుసుధాస్రవంతులే
పారెడుచోటులన్ నిలిచి భావములో శృతిపెట్టి పాడి యా
తోరపుగీతికాలహరితో లయమొందుచు జూతురీశ్వరున్. 259

ఉ. చీకటియందెసాధకుడు సృష్టిసమస్తము నైంద్రజాలకుం
డేకముఖానజూపుగతి నీశ్వరరూపమహాపదార్థముల్
లోకములన్ని జూడగల లోచనముల్ గడించునట్టి య
స్తోకతపప్పమాధినివి భూతమలీమసులౌదు రారయన్. 260

శా. పాతాళంబు నభంబు ముట్టెదవు నీభావంబులో వెల్గులో
లోఁత్రైయున్న నిగూఢసత్యమును నీలోనున్న జీవత్వ వి
ద్యాతత్త్వంబు పృథత్వబుద్ధిని నిదిధ్యాసంబు గావించి యీ
రీతిన్ మృత్యువు గెల్వవచ్చు మఱి వేరే దారి లేదేదియున్. 261

ఉ. పారముముట్టగాఁ బ్రకృతిపాడెడుగీతము లాలకించుచున్
చారు ప్రభాతవిస్ఫురనిశాత శరాహతివిచ్చిపోవు దు
ర్వార చరాచరాత్మకప్రపంచమునంగల శూన్యభూమియం
దారయవచ్చు నాసవిత నాయమృతంబుదివిన్ బ్రభాతమున్. 262

తే. గీ. భక్తులీజ్ఞానఫక్కని పారశీక
ప్రభువు జంషీదుపానపాత్రను జగంబు
జూచినట్టుల భువనముల్ చూడఁగలరు
జ్ఞాని హృదయంబులోకముల్ కాంచుపేటి. 263

ఉ. జ్ఞానపథంబు మిక్కిలి వికాసమునై నది పూతమైన యీ
స్థానము సద్గుణంబులకుఁ దావలమైనది దీనియందునే
మానవుఁడైన ముక్తిపదమార్గము గాంచునుగాన నీయశో
గానము మూఁడులోకములఁ గంపిలసేయు తమస్సు మాయఁగన్. 264

## — వంచకులు —

ఉ. నీతియు సద్గుణంబులను నేరనివారిని త్రాఁగుబోతులన్
గాతరులన్ దిగంబరులఁగాంచినఁ గొందఱు బ్రహ్మవేత్తలం
చాతతపూజ్యభావమున నర్చనసేతురు పూర్వమార్షసం
జాతము జేసెనే కలుషజాలము పాలనురక్తముండునే. 265

సీ. శ్రీకృష్ణుఁడే గొల్లవేడెలఁగూడిన
గీతఁబోలినగీతి గీయలేఁడు
వ్యాసుఁడే విస్వస్తదాసుఁడు నగునేని
బ్రహ్మసూత్రంబులు వ్రాయఁలేడు
అమరాధిపతి యహల్యాజారుఁడైన ని
లింపులదివిని పాలింపలేఁడు
ఎలమివిశ్వామిత్ర ఋషి మేనకనుగూడ
సృష్టికిఁ బ్రతిసృష్టి సలుపలేఁడు

తే. గీ. బొగ్గులెపుడు బంగారు కాఁబోవనట్లు
నీతిబాహ్యులు తత్త్వమున్ దెలుపలేరు
అంధుఁ డాదిత్యు నెఱుఁగనిఁయట్లు పాపి
యెఱుఁగలేఁడీశ్వరుని చదువెంతయున్న. 266

శా. కృష్ణుండే వ్రజకామినీమణులకున్ గేల్మోడ్చువాఁడైనఁ బ్రా
జిష్ణున్ విష్ణుని రాజసూయమున నాజిన్భీష్ముఁ డర్థించునా
తూష్ణింపన్ శిశుపాలుఁ డేమెఱుఁగఁడాదూషింపఁడానాఁడు వ
ర్ధిష్ణున్ గృష్ణుని శత్రుకోటి యటు చిత్రించెన్ దురర్థంబులన్. 267

ఉ. మానసమున్ జయించి ఋజుమార్గమునన్ నిజతత్త్వ మీశ్వర
స్థానము తానుగానెఱుఁగుసాధకునిన్ బ్రజఁ దిట్టుగాక నీ
భానునిపైని చీఁకటులు పర్వినరీతి నభంబు మబ్బులన్
బూని మలీమసంబగుచు పోల్చినరీతిని విచ్చిపోవవే. 268

ఉ. నైతికజీవితప్రకరణంబు ప్రశస్తమెగాని చాటునన్
బాతకకజ్జలంబు పరిపాటిగఁ బట్టుచునుండెనింక నీ
రీతులుచూచిరేని విపరీతము చక్కెరపూఁతకత్తిగా
భీతినిగొల్పు నీచెనఁటిబృందము నేమిటి చెప్పు జ్ఞానమున్. 269

ఉ. కాకము నూకలేరుకొనగా రసహీనరవాప్తిదోఁగి యా
కాకలికాస్వరంబు తనకంఠముపట్టక కోకిలాకృతిన్
లోకము నిందసేయును నలోకమహామహనీయసత్కళా
లోకనలేని మానవుల లోపములిట్టి వెసుమ్మెఱుంగగన్. 270

మ. సమయమువచ్చినన్ దృణముసాయముచేయనివారు భక్తికై
క్రమమరియాద నేపగిదిగా నెరవేర్తురు వేపగింజలన్
నిమిరిరసాలసాలఫల నిర్వృతిగాంతురెభక్తి త్యాగమం
దమరి జితేంద్రియత్వము వదాన్యతగానమృతత్వమేర్పడున్. 271

చ. ధనికులు లేదులేదని సతం బనృతంబుల నాఁడుచుందురే
పనికిని తోడురారలని పాతనిషిద్ధ నికృష్టజీవనం
బును వెలుబుచ్చువారలకు బోధయసాధ్యముగాన గీతలో
ఘనులకెగాని నీచులకు జ్ఞానమురాదనివ్రాసె కృష్ణుఁడున్. 272

ఉ. లోభికిలేదు మోక్షము లలోకమహామహనీయసత్తపో
వైభవమున్నగాని నిజభక్తుఁడు దానము జేసిచేసి యా
లాభము లక్ష్యమందొక కళాసదృశంబుగఁ జూడనేర్చు నా
నాభయవారకంబయిన నాకము మాటలలోన నున్నదే. 273

ఉ. ఆరసి తత్త్వమార్గములయందు మహామహిమల్ గడించి చె
న్నారుచునుండ కుచ్చితమనస్కులు జ్ఞానుల బ్రహ్మభావమున్
నేరక సంశయాత్ములయి నిందలుజేసిననేమిలెక్క పెం
టారులు నత్తలేరుకొన హంసలు రత్నము లారగింపవే. 274

ఉ. కొందరుతిట్టుచుంద్రు మఱికొందరుగూడి నుతింపుచుంద్రు వీ
రందరు వారిలోగల గుణాగుణముల్ ప్రకటించువారు మా
చందము ధర్మమార్గమున సాగుచుండును నీశ్వరుండు మా
యందు నిరూఢమైయెదలయందు యదార్థము జెప్పఁజూచితే. 275

ఉ. తండులముల్ ఘృతంబు పిసితంబును మెక్కుచు లంపటుండవౌ
షండనిషిద్ధజీవనవిషణ్ణుఁడు భ్రష్టుడునై నయోగికా
ఖండజితేంద్రియై కవిశిఖాద్భశదగ్ధమనస్కుడై యసం
గుండయి తన్నెఱుంగునెడ ఘోరమువాసి ముముక్షువయ్యెడున్. 276

ఉ. భూరుహమెల్లవారలకుఁ బుష్పఫలంబులు నీడయున్ బ్రతీ
కారములేకొసంగుటనుగాంచి బకంబది యభ్యసింప గా
నేరదు పెద్దకాలమట నిల్చియు మోసముచేసి చేపలా
హారముసేయు దుష్టమతికబ్బునె సత్పహవాస సంపదల్. 277

గీ. మంచివారలు హితులు లభింపకున్న
చెడ్డవారల స్నేహంబు చేయరాదు
మల్లెపువ్వులులేకున్న మానవలయు
ఉల్లిపువ్వుల ముడువగా నొల్లరెపుడు. 278

ఉ. పెక్కురువంచకుల్ గురులపేరునవత్తురు వారిచేతిలోఁ
జిక్కకు ప్రేమభావములచే మతి ముక్కలుచేసివేసి కై
పెక్కగభ్రాంతిబెట్టి మరలింతురు దుష్మయిపోవ ధర్మమున్
నిక్కమువందు నీతనువు నీరయిపోయిన మానఁబోకుమీ. 279

ఉ. లోపములున్నవారు గుణలుబ్ధులు మూర్ఖులు స్వార్థలాభసం
తాపమునన్ బరార్థసముదాయములన్ హరియించుశంఠలున్
గాపురుషుల్ ప్రబోధకులుగాఁ గనవత్తురు కొందఱి మహా
పాపుల మాయలకు బడనివారలెజ్ఞానము నేర్తురారయన్. 280

ఉ. దుష్టులు కొందఱీశ్వరునిత్రోవలు నేర్పుఁడటంచువచ్చి సం
తుష్టులఁబోలె పైపయినిదోఁచిన గోతులుత్రవ్వుచుందురా
భ్రష్టులు పాపులై వ్యథలపాలయిపోదురు కుండకొండలన్
నష్టముసేయఁబోయి యదెనష్టము జెందెడుమాడ్కినారయన్. 281

ఉ. కొందఱుతత్త్వవేత్తలని కోపము తాపము దుర్విదగ్ధస్వ
చ్ఛందదురాగ్రహ గ్రసితపండపదంబున సుందరందులోఁ
గొందఱు మత్తువస్తువులకున్ గయివాచెదరిట్టిమోసగాం
డ్రందరు బ్రహ్మవేత్తలని యారయఁబోకుఁడు కీడుమూడెడున్. 282

ఉ. దేశికుఁడంచు చెప్పి నుపదేశముసేయునుగాని నాత్మసం
దేశమునందు చీఁకటిని దెల్పెడు మాటలచేత తాత్త్వికా
దేశము తెల్లమైనిశల దీర్చెడు వెన్నెలవెల్గుపోఁచు నా
వేశసమాధివచ్చనె ప్రదేశములెన్నిఁటిమార్చి యార్చినన్. 283

## మహాత్మ్యములు

ఉ. ఏముమహాత్మ్యముల్ కలుగుటే పరమార్థమటంచు చెప్పుమీ
భూమిని పెక్కు వంచకులు మోసముజేయుచు వాదలభ్య వి
ద్యామహిమన్ మలీమసులునైన మహాత్ములమంచుచెప్పుచున్
గామితముల్ గడింతురవి కాదని చెప్పుటకై యగత్యముల్. 284

సీ. అలభగీరథుఁడు దివ్యాపగన్ విడిపించి
దివినుండి నేలకు దింపినాఁడు
ఆయగస్త్యుండు మహాజలరాశిని
చుక్కైన లేకుండ జుట్టినాఁడు
మనుసూరు నురిదీసినను చరాచరముచే
నీశ్వరుండనుచు పాడించినాఁడు
మొహిదీనుబాదుషా మహనీయుఁడార్షి మృ
త్యువును రావలదని త్రోసినాఁడు

తే. గీ. ఇట్టు లధ్యాత్మవిదు లెందరెందరీ జ
గాన మహత్మ్యములఁ జూపఁగఁగినారు
వారివలె శక్తిగడింపనేరనట్టి
వారితపసేల వేదాంత వాదమేల. 285

ఉ. మాటలు వేయి చెప్పినను మానసికంబగు సక్తిరాని దే
లాటి ప్రబోధమైన విఫలంబని యెల్ల మతప్రచారకుల్
చాటిరి యామహామహిమలన్‌గల యోగరహస్యముల్ జగ
న్నాటకరంగమందవియె ధర్మములిప్పటికైనఁ జేర్కొనన్. 286

సీ. విశ్వరూపముజూపి విశ్వజ్ఞుఁడగుకృష్ణు
డారూఢిచే నవతారుఁ డయ్యె
ఆకాశసీమలపై కెక్కి నిజతేజ
మగపర్చి మహమద్ పయంబరయ్యె
చచ్చినవారిని దెచ్చిన లేపి పం
పిన కీస్తు దేవునిబిడ్డడయ్యె
జనమేజయుని యజ్ఞశాల సర్పాల నా
కర్షించువారు మహర్షులైరి

తే. గీ. ఇట్టులెందరెందరు విజయేచ్ఛచేత
మహితమహనీయ మాహాత్మ్య మార్గమునను
మానవాదర్శభావులై మతినిగెలిచి
జగము తరియింపజేసిరా నిగమనుతులు. 287

శా. మూసాకాలమునాఁడు మాంత్రికులు సంబోధించిశాక్తేయ వి
ద్యాసక్తిన్ వివిధాస్త్రశస్త్రముల భీభత్సంబు కల్పింప స
ధ్యాసన్ దండముచాచి తత్కళను విధ్వంసంబుగావించి వి
శ్వాసం బీశ్వరశక్తిపై మలిపె మూసాముక్తకంఠోక్తిచేన్. 288

చ. సగరునిపుత్రు లాకపిలుఁ జంపుటకై చనుదేర వారలన్
దెగడక కన్నులన్ దెఱవి ధిక్కృతిఁ జూచిన మండి బూడిదై
యెగసి రదే త్రికాలములనేని జయించు మనోబలంబునం
దగపడు నగ్నిభౌతిక మహాగ్నికి హేతు వారయన్. 289

చ. ఒకఁడు జయించెమృత్యువుఁను నొక్కఁడు మృతువుఁజూచినాఁడు నిం
కొక్కఁడు జరాభరంబు నవయౌవనమట్టుల మార్చినాఁడు నో
ర్తు క నిజనాథుప్రాణములతోఁ జని క్రమ్మరఁ దెచ్చియిచ్చె నీ
ప్రకరణముల్ నిజార్థప్రతిపాదకముల్ తను గన్నవారికిన్. 290

తే. గీ. ఈమహారూఢమార్గంబు నెఱిఁగినట్టి
వారిచర్యలె వేఱు సంసారఘోర
వారినిధి వారలున్న దుర్వార వైరి
వారములఁ గూల్చి సాక్షియై వరలుచుంద్రు. 291

ఉ. దక్షుఁడు నీశ్వరుం దెరియుదారి యెఱుంగక యజ్ఞదీక్ష వి
శ్వక్షయమైన సంగతి నెసంగఁగ నాతని యజ్ఞపూరుషం
డక్షరలీలఁ గాల్చి విలయం బొనరించెను నాటినుండి జా
తిక్షితి నూత్నసస్యముల దీప్తివహించె జగంబు మెచ్చఁగన్. 292

శా. విద్యాకౌశలమున్ గవిత్వమును విద్వేషించి గర్వించు సం
వేద్యావద్యుల రబ్బువారిని ఖురాన్ విన్నాణసత్కావ్యమున్
హృద్యంబౌ ప్రభు తీశ్వరుం దెలిపి నిర్జించెన్ మహమ్మద్ రసూ
లాద్యం బైన రసస్వరూప సముపాశ్యబ్భాంతి సంధిల్లఁగన్. 293

సీ. లోకవాంఛలఁ గుంది లోలతఁ గడుజెంది
పురుగులవలె చెడిపోవవలదు
మతమతాంతర వామమార్గాలఁ బడి బ్రహ్మ
భావంబు తేజంబుఁ బాయవలదు

జ్ఞానమహాసభాస్థానంబు విడనాఁడి
పరధర్మములఁ జేరి మురియవలదు
ఈజన్మఁ గాకున్న పై జన్మలో మోక్ష
మొందవచ్చని మోస మందవలదు

గీ. తిరిగి యీజన్మరాదు మృతి యనెడు సుడి
గాలి హతమార్చుఁ దుదకు నే గడ్డివలెనొ
మొలిచి పూలు పూచియు రాలిపోవునట్లు
పోవుదురు జీవు లారీతిఁ పోవవలదు. 294

సీ. దేహాభిమానంబు తీఱ్ఱిడించునందాఁక
జ్ఞానమార్గంబులో స్థానమేది
భక్తునిగురువు రాపాడించి పీడించి
చిచ్చులోపల పరీక్షించవచ్చు
సన్యాసిఁ జేసిన సామ్రాట్టుఁ జేసిన
స్వామి నీవే యను భక్త వరుఁడు
అపరోక్షవిజ్ఞాన మైనమోక్షమునకు
సోపానములు గట్టి చూరఁ గొనును

గీ. తెలిపోయినవారు పాతాళమునకు
జారిపోదురు నుభయభ్రష్టతను జెంది
భ్రాంతులను బొంది డింది యాక్రందనమున
క్రిందమెట్లకు దిగిపోయి కీర్తిఁ బాసి. 295

ఉ. వంటకుఁ గుండ త్రవ్వుటకు పారయు దుక్కికిఁ గోల వ్రాతకున్
గంటము లెట్లగత్యమొ యగత్యము దేహము మోక్షసిద్ధి కీ
యొంటిని కూటికుండవలె నుంచినఁ జీఁకయిపోవు దుక్కికిన్
గంటము వాడిన ట్లగునుగావున భక్తుఁడు మేలుకోవలెన్. 296

సీ. పగలంత యేదొ యుపాధికై శ్రమపడి
మాపులు పోయి గ్రామాలవెంట
ఏది వారు నిజంబుగాఁ దలపోసి య
నుష్ఠాన మొనరించి నుడువుచుండు
రట్టివిజ్ఞానంబు నాదర్శముగఁ జేసి
యెలుగెత్తి ప్రజకు బోధింపుచుండి
రపుడు వా రొనరించు నాత్మసమర్పణ
మధ్యాత్మశక్తిని యరసి యరసి

గీ. వేనవేలుగ ప్రజవీక్షఁ బూనుచుండి
రది స్వరాజ్యంబుకంటెను నధిక మనుచు
వరదవచ్చిన నేటికై వడి దిగంత
ములకు వ్యాపించె నామతములు జగాన. 297

చ. శలభము దీపమందుఁ బడి జచ్చెడుకైవడి నీశ్వరాకృతిన్
విలయమునొంద సేయును వివేకిమలీమసకర్మటోలముల్
తెలియనివారు భక్తు లని తెల్పుచు నీల్గుచు కోళ్ళలీల కూ
తలు నిడుచుందు రందు బలిదానము త్యాగము ప్రేమ యున్నదే. 298

తే. గీ. ఇట్టులే మంచిచెడ్డ లీయిలను నిలుచు
నిలువ రెవ్వరు కాలంబు పిలిచెనేని
కాలగర్భములో లోకజాల మెల్ల
మణగిపోవిచు నున్నదే క్షణము క్షణము. 299

ఉ. జీవకళాకలాపములఁ జె న్నరరారెడువారు సిద్ధులన్
దేవతలన్ జయింపఁగల తేజముగల్గినవారు తెల్వికిన్
దావలమైన మానసికతత్త్వమునన్ సభలందు వాదమం
దీవెకొనేనా యంచు వచియింపఁగ నేర్తురు మానభానపుల్. 300

శా. గోరీ లన్న ఫకీరులున్ ఋషులు ముక్తుల్ పండి నిద్రింపు నా
గారంబుల్ పరికింపఁగా "హసనుఖిర్ఖానీ"కి "బుస్తామి" తా
గోరీనుండి ఖురానునేర్పె రవియున్ గుఱ్ఱంబుగా వచ్చి సొం
పారన్ వేదము యాజ్ఞవల్క్యునకు నేర్పన్‌జాలె మర్త్యాకృతిన్. 301

ఉ. ఎందరొ యీసమాధుల నదేపనిగా నిదురించుచుండి రిం
దెందరు లేచిరో మఱియు నెందరు నిద్రనుజెంది పూఁడి యీ
చందము నేరనట్టి తెరచాటున మాటయి మాటలాడకే
కుందుచునుండిరో తెలుపు కోవిదుఁ డొక్కఁడు లేఁడు చూడఁగన్. 302

చ. ధనమును వైభవంబు ప్రమదం బగు రాజ్యరమావిభూతియున్
దనరినవారికన్న సముదంచిత విద్యనె గౌరవింతు రా
మనులు మహాతపోమహిమ గల్గినవారినె పూజసేతు రా
యనుపమబ్రహ్మవిద్య నమృతాకృతి గూర్చును మాట లేటికిన్. 303

తే. గీ. కానఁ జదువులకంటె విజ్ఞాన మధిక
మదియును హృదయాంతర్వర్తియైన నీశ్వ
రుని యెఱింగించు విద్యగాఁ దనరవలయు
నపుడుగాని తరింపఁగా నలవిగాదు. 304

ఉ. జంకుచునుండు మన్నిటను జంకకు దేనికినైనఁ గాని యా
పంకము వచ్చినప్పు డరిభంజనదగ్ధదవాగ్నిఁ బోలె ని
శ్శంకను మార్చివేయుము వెసన్ గపిలుండు మహాత్మ ధాపదన్
సంకరమారమారకముచాట్పున జ్ఞానదవాగ్ని ప్రేల్చరే. 305

చ. జడము ప్రపంచజీవితము జన్మలయాకృతి దీనియందు నీ
నడత నిషిద్ధమైనది యనంతమహామహిమాస్వరూప మే
ర్పడవలె నన్న నూపిరిని గ్రాలెడుచక్రము లాఱు దృష్టిలో
నిడుకొని వాని నూర్ధ్వమున నెట్టుము నాశమురాదు ప్రాణికిన్. 306

చ. నిజముగా నీశ్వరార్థమహనీయపదంబులు చెప్పెనేని యీ
ప్రజలకు నచ్చ వేయెడల వాదములోని సయుక్తికంబులే
ఋజువులు నమ్మచుందురు నతేంద్రియమైనది బ్రహ్మతత్త్వమే
ఋజువులఁ బోలు పోలికల నెంచెడి వన్నిపదార్థముల్ కదా ! 307

ఉ. మీరు వచించుమార్గములు మే మవి కా వని చెప్పలేము మీ
దారి రసానురాగభరితం బయి యుండిన నుండవచ్చు నె
వ్వారికి వారు నిక్కముగ బంధము వాసెద మన్న మాటలో
సారము ముట్టఁగావలయు పావనమైనదిగాదె జ్ఞానమున్. 308

మ. ఒకటే యున్నది రెండులే దనినచో నున్నట్టి సద్వస్తువే
సకలంబై సచరాచరం బయిన విశ్వం బంచు దోఁచున్ గాదా
యిఁక నీ వెక్కడ నుంటి వేతపము లిం కేలా భయం బేల బం
ధకముల్ దేనికి ఉత్తవాదములు మిథ్యాభ్రాంతి వర్జింపుఁడీ. 309

ఉ. చీఁకటి పోయెనేని నిజజీవితమున్ మరణంబునుండి చీ
కాకు వహించకుండ నరకంబును బంధము వాసి స్వర్గమున్
నాకము జేరవచ్చు నిహమందె సమస్తము నున్నవిట్టియా
లోకన లేనివారు పరలోక మటన్న నెఱుంగనేర్తురే. 310

మ. వేదాంతం బన పారిభాషికపదావిర్భూత వాక్యార్థ సం
వాదానూనకుతర్క లోక కుహనాబద్ధంబుగాఁ బోవ దిం
దేదో పెద్దనిగూఢసత్యము మహాస్వేచ్ఛావిహారక్రియా
మోదంబున్ రసమున్ బ్రియంబు నిజమున్ మోక్షంబునొప్పారెడున్. 311

ఉ. పోయినకొంపలో చివికిపోయిన కణ్ణలలీల మాంసమున్
బోయిన యస్థిపంజరము బొత్తిగ నేలకు వంగిపోయె న
య్యో ! యగుపించఁ డీశ్వరుఁడు ఊహకుఁ దోఁచని యీనిశీథిలోఁ
బోయిన నేమిలాభ మని పోయెను బుద్ధుఁడు నాస్తికాకృతిన్. 312

ఉ. లోకము లప్రపూర మగులోచనముల్ బచరించు నాకళా
లోకనమందు దహ్యా మగులోపములన్ సవరింపలేక దుః
ఖాకర మైనచిత్రములయందు లయం బయిపోయి చెల్లరే
నాకము గానలేకఁ బ్రవినాశపథంబునఁ బోదు రయ్యయో! 313

## -♦ వై రా గ్య ము ♦-

శా. ఆలోచించితి మెల్లమార్గములు దివ్యాదర్శమౌ జ్ఞానవి
ద్యాలోకంబున మూఁడులోకములు మాయందే విరాజిల్లు నీ
లోలత్వంబు వృథా ప్రయాసములలో లుప్తంబులై యున్న మో
దాలన్ నిల్కడలేదు తథ్యమగు మోదంబొక్క వైరాగ్యమే. 314

ఉ. శాస్త్రము పారిభాషిక ప్రశస్తపదంబులచేతజ్ఞానసం
భస్త్రిని నూదుచున్నది ప్రభాభరితంబగు దీనిలోరసా
విస్త్రకమైన నాదపరివిశ్రుతమందు మనంబుఁ జేర్చితే
జస్త్రితయంబులైన రభసంబుల ముక్తిని గోలుపోదువే. 315

చ. వనితలదృక్కులే యురులు వాక్కు విషంబు కరంబు ముంగురుల్
ఘనతర కాలపాశములు గాఁగను యోగికి వారియందుఁ బ్రే
మను వెలిఁబుచ్చు లంపటులమధ్య నిమేషము చోటులేదు యె
వ్వనిది నిజంబొ యెవ్వని దబద్ధమొ చెప్పఁగలేము నేరుగన్. 316

చ. ఇతరులతెన్నుఁ జూచి యిద మిత్థము చెప్పఁగలేము లోకజీ
వితమున శాంతి లే దెచట విన్నను కాలము చుట్టుచున్ నిమీ
లితనయనంబులన్ దిరుగలింబడు గింజలలీల నొక్కుచున్
హత మొనరించుచున్నది మహాత్ములఁ బామరు లొక్కరీతిగన్. 217

ఉ. ఈవిటు యెన్నిసాళ్ళు విలపించెదర వెవ్వఁడు దిక్కు నీకు నీ
కావల సున్నసంత మఱి యంతయు లేనిది దీనిలోన నీ
జీవిత మార్చితే చిగిరి జీర్ణములౌ వసనంబు లేమియున్
గావు యథేచ్ఛలోకమునఁ గల్గువికాసముఁ జూడు మంటకన్. 318

ఉ. కొండల జారు నేళ్లవలె కోమలమున్ దిగజార్చి కాలనా
థుండు వినీలజాలములు తోమియు తెల్లగ మార్చివేసె నీ
పండిన నెత్తిపూలు ముడువం దలపోసెదవేల నీ వయో
భాండము బ్రద్దలై రసము వాయక పూర్వమె సొంపు నింపుమా. 319

శా. నీకున్ దోచినదెల్ల నిక్కముగా నిర్ధారణన్ జేయ కా
లోకింపన్ దెరచాటు యానిజము నీలోనున్నదే యున్నదం
దేకోఁద్బో మలినావభావములుగా నీక్షింపఁగా వచ్చినన్
జీఁకట్లున్నవ టంచు నెంచు మట ప్రాచీనోదయోద్భాసమున్. 320

ఉ. తృప్తి జయంబులోఁ గలదు తృప్తిని దుర్దయమందు గూడ సం
ప్రాప్తము జేసికొమ్ము మధుపానము చేసినవాఁడు షాయిగా
సుప్తిని జెందునట్టు పరిశుద్ధ మనోమయికంబు యౌగికా
వ్యాప్తిని నిస్పృహన్ బడయనందు ప్రశాంతత వచ్చు నంతటన్. 321

ఉ. పోయెడుధానికై వగవఁబోవకు మెప్పుడొ కాలగర్భమం
దీయఖిలంబు దాగి యగుపించదు యున్న దినాలలో సుధా
మేయమనోజ్ఞజీవిత నిమేషము నీదని జ్ఞానయోగమై
రేయము ద్రావుచున్ బవలు రేలు వినోదముబుచ్చు నెచ్చలీ. 322

గీ. ఎవ్వ రేకీడుఁ జేసిన నొవ్వనాఁడ
వలదు తనప్రాప్తమును దిట్టవలయు నొష్ట
నేది వ్రాసెనొ యదె మన కెదురువచ్చు
ధానికై చింత సేయుట మానవలయు. 323

గీ. పలకపై సుద్దగీతలవలె ప్రపంచ
జీవరాసులరూపులు చెఱిగిపోవు
వ్రాయువాని కలంబు వక్రములు దిద్ద
నెవరి తరమౌను ? బ్రతుకట్టు లేఁగుచుండు. 324

శా. నీలోనున్నవి పంచభూతములు వహ్నిత్వంబు తత్ దృశ్య మే
యాలోకించెద వెండమావులజలం బర్థించిన ట్లీమహా
కాలం బేదో నిపాతనిమ్న నిరయాకారంబు గొంపోవు నే
వేళన్ దీని నెఱింగి నీమనసులో నిశ్వంబు వీక్షించుమా. 325

గీ. ఆదమరుపున నిద్రించునట్టిగృహము
గాదు మానాళ్ల బ్రదుకు లోకంబు నెఱవు
కొన్న, నీసత్ర మీప్రొద్దు గ్రుంకెనెడల
దారి గనరాదు ఘానభోధ్వాంతమందు. 326

ఉ. ఏటికి యీవిచార మది యేటికి జీవము బాసికొంట కే
లాటి తెలుంగు లేక యిటు లాతిపథంబులు ద్రొక్కి భీతి ని
చ్చోటను మీనమేషముల చూచుచునుంటివి లాభమేమి యే
నాఁటికి యేమి కాఁగలదొ నర్మిలి బాయఁగరాదు కర్మమున్. 327

చ. ప్రతిసమయంబునున్ విషముభంగి తలంచుము ఏది ఎప్పుడో
హిత మొనరింప దీబ్రతుకు హీనపరంపరలందుఁ గ్రాలుచున్
గతములకై ప్రలాపమును కాఁగలవానికి చింతచేసి సం
తతము విచారసాగరము దాఁటగనీయదు యెట్టివానికిన్. 328

ఉ. ఏది జితేంద్రియత్వ మఱియేది యథార్థము జ్ఞానతత్వ సం
పాదనయందు త్యాగము పవాసము శీలము నైతికంబు మ
ర్యాద పరోపకారము నహంకృత సాత్వికసిద్ధి వేనిలో
నేది కొఱంతయున్న మఱి యేగతివచ్చు మహాత్మ్యసంపదల్. 339

శా. ఏ దైనన్ భగవంతుఁ డుండి కరుణాభీష్టాప్తి కాపాడు నాఁ
డౌదార్యంబును మోదమున్ విజయమున్ యోగించులేదేని నిః
ఖేదం బైనపథంబు మానవులకున్ గ్లిష్టంబు విజ్ఞాన ది
వ్యాదర్శంబులు వేలు పోల్చఁదగ దధ్యాత్మ్యంబుతో లోకమున్ 330

శా. ఎన్నో భాగ్యము లున్న యెన్నొ విజయాభీష్టంబులున్ గల్గి సం
పన్నత్వంబునఁ దూఁగుచున్న ప్రమదవ్యాపారపారీణుఁడై
ఖిన్నత్వంబు బాయఁ డజ్ఞుఁ డయి యేక్లిష్టానకోఁ బోయి సం
ఛిన్నంబైన మనంబుతో వగచి వాంఛించుఁ విచిత్రంబులన్. 334

మ. వలయే పక్షులుఁ దెచ్చి పెట్టవు వలన్ బక్షుల్ ప్రమాదంబునన్
బలియై పోవును కాలవాహిని ఘటప్రారబ్ధమున్ బట్టి యీ
కలిమిన్ లేమిని తెచ్చిపెట్టు నెడ దుఃఖంబున్ సుఖంబుఁ మను
షులకున్ దప్పవు కర్మబద్ధులు ముముక్షుల్ కారు నానాఁటికిన్. 332

చ. ఒకయవతారిచే వరములో ధనధాన్యములో పురంబులో
వికచసరోజలోచనలొ పృథ్వియె కోరినయంత పొంది యూ
రక తిని నిద్రవోవునెడ రాదొకమృత్యువు వచ్చెనేని యీ
సకల ధరాప్రపంచకము చచ్చినవారలవెంట వచ్చునే. 333

ఉ. చీఁకటియందు దుఃఖములచేఁ జివుకంగల జీవితంబు నీ
వేకడఁబెట్టఁబోకు మిది యేమిటిలోకము మూఁడునాళ్లము
ల్లై కడతేరుచున్నది యహంబులు షస్సులు బాణపంక్తులై
తాఁకి చికాకుపెట్టు ప్రమదంబసు నాసనుమాను మేయెడన్. 334

ఉ. అచ్చపుజీవితంబు కలయట్టిది జీవుని బంధమోక్షమి
ట్లెచ్చటినుండి వచ్చినవొ ఈశ్వరుఁ డెవ్వరొ యేది పుట్టుమన్
జచ్చుచు నున్నదో తెలియఁజాలనిభ్రాంతి తపస్వి నిద్రపో
వచ్చునె యీజపంజనము బాసి తపస్సును గెల్వఁగావలెన్. 335

ఉ. కొందఱు విద్యచేతఁ దమకున్ ద్రిజగంబు లెఱుంగవచ్చునం
దందురు కొంద ఱాత్మవిదులై సచరాచరభూతకోటి మా
యందు ప్రదీప్తి నొందు నని యందుఱు మోసగాండ్రు రీ
తం దమ లన్ని యున్నవని సాకులు పల్కెదు రర్థకాములై. 336

ఉ. భాసురజీవతత్త్వము ప్రభాపరిపూరితమైన బ్రహ్మ జి
జ్ఞాస నెఱింగి నేర్చికొనఁజాలినదే యెలుగెత్తి యేయుప
న్యాసము లిచ్చి చెప్పుటకు నైనది కాదది దగ్ధకాష్ఠ వి
న్యాసముచంద మీశ్వరునియందు లయంబగు మార్గ మారయన్. 337

ఉ. వచ్చుటొ యీశ్వరుం దెలియుజ్ఞానము నేర్చి విశుద్ధుఁడై స్వతం
త్రేచ్ఛఁ జరావరంబులు జయించుటొ వెల్లునుగాని జ్ఞానికిన్
బిచ్చమురీది స్వర్గము లభించినఁ జెల్లదు దానికన్న యీ
మచ్చు దరిద్రజీవితమె మంచిది మంచిదిగాదు భైక్ష్యమున్. 338

ఉ. ఘోరమృతిస్వరూప మిది క్రూరవిషానలదగ్ధభూమి దు
ర్వార దురంత దుఃఖ మిది రావల దన్నను లెక్కసేయ కా
వారిని బోవువారె భయదంబు జడత్వము బాసి యీశ్వరా
కారము జూడనేర్తురు నగాధ మహామహనీయపద్ధతిన్. 339

శా. వేదాంతం బని కొందలీశ్వరునకై పెక్కు దు
ర్వాదంబుల్ పొనరింతు రెందుకవి విధ్వంసాప్తి కే గాని యే
తాదృశ్యంబుల మాని జ్ఞాని హృదయాంతర్వర్తియౌ నీశ్వరున్
మోదం బాఱఁ గ్రహించిమించి విహరించున్ దానె బ్రహ్మాండమై. 340

సీ. మతము లన్నియుఁ బోవు మతవాదములుఁబోవు
జ్ఞానమాదర్శ మై గ్రాలఁగలదు
విద్య లన్నియుఁ బోవు విన్నాణములుఁ బోవు
విజ్ఞానదీక్షయే వెలయఁగలదు

శాస్త్రంబులును బోవు శస్త్రంబులును బోవు
తన మనశ్శక్తియే తనరఁగలదు
రాజ్యంబులును బోవు రాజులును బోదు
రీశ్వరరాజ్యమే యేలఁగలదు

గీ. శాంతి చేకుఱు నన్న వస్త్రములు గలుగు
నీతిబాధలు మొదలంట నెగిరిపోవు
ప్రేమ సెలయేళ్లు పాఱు హృద్వీథులందు
నదియె విజ్ఞానదివ్యరాజ్యార్థ మరయ. 341

## శీలము

చ. చెడితి నటంచుఁ దా నొకటి సేయఁడు చేసెడివెల్ల చెప్పి వె
ల్లడిగ నొనర్చు దాన పరలాభము లేదనుకొన్న మోసమున్
బొడమదు నైతికం బనుచు బొంకుచు చెప్పెడి దొండువాడు చే
సెడిది మఱొండు నీయఘముచిచ్చయి కాల్చదె యంతరంగముల్. 342

చ. నెల నుడుకోటి మబ్బుతెరనించి వెలుంగును మాటుసేయు నె
చ్చెలులు దుమారమున్ గలిపి చేట్పడు నైతికరాజకీయ వా
ర్తల నెవ రాలకింతురు పరస్పరప్రత్యయనేయబుద్ధు లా
వలపతితా వశేషములఁ బాయరు బాములు వడ్డకాలమున్. 343

ఉ. కల్లలు భావజన్యములు జ్ఞానపథంబున మాటలాడఁగాఁ
జెల్లద దేది యీశ్వరుని జేరెడుత్రోవ యథార్థ మేది సం
ధిల్లు నిజాత్మతత్త్వమును దృష్టిగతం బొనరించు నేది యా
యుల్లము భావగీతములతో నలరించి యెఱుంగఁగావలెను. 344

ఉ. దారులు కావు మృత్యువును దన్ని నివృత్తిని గాంచునట్టి సం
స్కారముచేఁ జరాచరము గాంచుటకై హృదయాగ్నికీలలన్
జీరి శరీర మాహుతిగ జేసినగాఁగాని నిజంబు నీశ్వరున్
జేరెడుదారియే దొరకిసిద్ధివహింపదు జ్ఞానయోగికిన్. 344

ఉ. చారులు కావు మృత్యువును దన్ని జితేంద్రియులై గుణాన్వితా
కారమలీమసం బయిన కర్మను డించి నిజాత్మతత్త్వసం
స్కార సమున్నతం బయినజ్ఞానము నేర్చుటకై జపవ్రతా
చార మఖాదికర్మములు సంధ్య లుపాసన యర్థ్వసిద్ధులున్. 346

చ. తపమును జేసిచేసి పరతత్త్వ మహామహి తైకతేజమున్
గపట మెఱుంగనట్టి తనకాంతిని( గూర్చి నితాంతశక్తితో
నెపుడు భవిష్యదర్థముల నీశ్వరూపము జూచుచుండు నా
యపరిమిత ప్రతాపమతి కయ్యెడుశౌచము శీల మారయన్. 347

గీ. నిష్టలోపల లక్ష్యంబు నిలిపి నిలిపి
వెలుగు గనుగొని యావెల్గు వెలుపలున్న
యీశ్వరుని( గన్నమేటి కిం కెవరు సాటి
పాటిలే దైహికము జగన్నాటకంబు. 348

మ. తరుగన్నేరని బ్రహ్మతేజ మెద నుద్యల్లీల నిండార మ
త్సరమాయాతమ మంతరింప( దపమున్ సాగించి యీరేడులో
కరహస్యంబులు గాంచునట్టి సుగుణాకారై కతేజస్వి కీ
యిరులన్ గాటుగ పట్టియున్న తెర యడ్డేయడ్డ దేనా(టికిన్. 349

చ. సహజములౌ జరామరణసంగతముల్ భవదుఃఖమిశ్రితా
వహ మిహజీవితంబున శుభంబులకై వగ( జెందుకంటె త
ద్రహిత నిషిద్ధభాజనపరంపరలన్ ముద మొందువారికే
మహిత సుఖానుభూతి యమృతత్వముజిక్కును మాటలేటికిన్. 350

* ప్ర త్యు త్థా న ము *

ఉ. ఈహాయవాహనుండు హయ మెక్కిన నీతనినెత్తి పాంథసం
దోహవిచారభార మదె తో(గెడు మానసికైకభార మీ
యైహికమందు లేదు దృశ్యమందు వెలార్చెడు కర్మభారమీ
దైహిక మార్చుచున్న దల తాడిని జువ్వివిధాన కౌ(గలిన్. 351

ఉ. ఆరసవాహినీసతము కడ్డము కట్టుము కట్టివేసి శృం
గారరసానుభూతి మెయి కాలహతిన్ దిగు లొందఁ బోకుమ
య్యో రమణీయ వైభవ మహోన్నత దివ్యపథంబు మాని యే
దారిని పోదువోయి యమృతంబును బాసి వినాశివై వెసన్. 352

ఉ. నీ వనుయోడ నీబ్రతుకునిర్ఘరిలోపల వీడు మద్ది యే
త్రోవకొ లాఁగివేయు నదె తోరపుశాంతిపథంబు గాగ నీ
భావము మార్చు మాపథురపానము మైకముగూర్చు నందు నా
నావిధ వాసనార్థ మలినంబు లయం బయిపోయి నెచ్చెలీ! 353

శా. కాలం బంతయు మాఱిపోయినది యాకావ్యాలలో పాట లీ
వేళన్ బాడిన నవ్విపోదురు జనుల్ విద్యుల్లతాతన్వి యె
న్నో లాస్యంబులు జేయుచున్నది తెరల్ ద్యోవీధి భేదించి నీ
లో లావణ్యముఁ జూపి వాని తెగువన్ బోకార్చుమా వేకువన్. 354

ఉ. పువ్వులమధ్య తుమ్మెదలు పోవుచు మోదము నొందుచుండఁగా
నివ్వసుధన్ పురుంగులు వసించి ప్రమోదముగాంచు మోదమున్
నెవ్వగలర్థభేధముల నేర్పడు నెల్లర కొక్కరీతి యీ
దివ్వెపతంగభంగమును తేజమునిచ్చు నయాచితంబుగన్. 355

చ. తెలిసిన పన్ని మిథ్య లవి తెల్వికి నందని యంతలోఁతులోఁ
గలవు సుమంబువాసనలఁ గ్రాలిన రాలెడు నైజ మున్న దా
విలసన వైఖరిన్ నలిపివేసినరూపరి మాఱిపోవు నీ
కలన నిజంబు గూఢ మయి కానగరాదు జడత్వ మర్దికిన్. 356

ఉ. ఆసవపానమందు నడియాసవికానము భాసమానసం
వాసితమైన ప్రేమరవాసితమైన వధూవిలాస వి
న్యాసము లాప్తవర్గ పరిహాసకదూర్వహమైన తృప్తి కై
లాసముకన్న గొప్పదని లాస్యముజేసెడు చూచితే చెలీ! 357

శా. ఏదో ఘోరవిషంబు వహ్నివలె నెంతే కాలగర్భంబుతో
ప్రాగుర్భావము నొంది పిట్టపిడుగుల్ వర్షింపఁగావచ్చు నా
పాదోరాశి తరంగమాలికలలో ద్వారాలు ఛేదించి నిః
ఖేదంబైన పథాన నీ వనెడు వ్యక్తిన్ నిల్పి మోదించుమా. 358

శా. ఏదోకాలము వైణికాకృతి నదే నెవ్వానినో పాడునం
దేదో పెద్దవిషంబు నున్న దతఁ డీపృథ్విన్ బ్రతిష్ఠించు సం
వాదం బెల్ల ఫలించు నాతనిజయధ్వానంబు దిక్కుంభికుం
భోదగ్రంబులు నెక్కి కీర్తిసతి సేయున్ ముక్తకంఠంబునన్. 359

చ. ప్రకృతిని మాటుఁబెట్టి విషమవాయువు వీఁచెడు చూడు నీకళా
వికృతి నిపాతమై యడుగుమెట్లకుఁ బాఱెడు నిట్లు జీవిత
ప్రకరణముల్ ముగించెదవె రాగర సైక సుధాస్రవంతులన్
శుక పిక శారికా నినదశోభిత మీ వయిచూడుమోదివై. 360

ఉ. పంటను గడ్డిమేసి పశువర్గము హాయిని జెందు గడ్డిన
ట్లంటుట పాప మన్న నది యాతపమందున మాఁడిపోవు ప
న్నంటక నూఁడిపోవు పతనాహతి రెంటికిఁ దప్పఁబోవది
ట్లుంట విరాగరాగఫల మొక్కటె యేటికి వ్యర్థవాదముల్. 361

## భ్రాంతులు

శా. విద్యాగంధములేనివారికడ నీవేదాంతవాదంబు కృ
త్యాద్యావస్థకుఁ దెచ్చు కావున నుపన్యాసంబు వర్జించి నీ
హృద్యస్వానుభ వైకవేద్య మహిమా దృగ్రూపశక్తిన్ వచో
భేద్యం బైన రసాబ్ధివీచికల నొప్పింపన్ దగున్ జ్ఞానివై. 362

శా. యావజ్జీవము విద్య నేర్చినను బ్రహ్మాండంబులో నొక్క సం
ఖ్యావృత్తంబు తరింపలేరు మఱి యీవాఖ్యానకారుల్ మహాం
ధీవిధ్వాంత తమో నిగూఢమతి వాదింపన్ బ్రవర్తింతు రా
యావాదంబులఁ గల్గఁ డీశ్వరుఁడు నీవై యుంటి వీ వారయన్. 363

ఉ. ఊహలు భ్రాంతిజన్యములు నున్నవి లేనివి చేర్చిచెప్పు సం
దేహమతున్ భవాబ్ధికడతేఱఁగ లేరు నిజంబు నాత్మలో
సాహసముంచి చెప్పుమట చిక్కు ఘటించిన తప్పులేదు నీ
యైహికమందు వ్యక్తిగతమైన ప్రపత్తిప్రతిష్ఠ చేయుమా. 364

శా. వేధాంతంబులు యుక్తి వాదమను విభ్రాంతిన్ విసర్జించు మీ
వేదాంతంబు రసానుభూతినెద నావిర్భూత చైతన్య వి
ద్యాదయితంబగు ప్రేమ పాఠములు నధ్యాత్మంబుగాఁ బోల్చి సం
పాదింపందగు జీవశక్తియమృత ప్రాయంబుగా మాఱఁగన్. 365

మ. సదసద్భేదము లర్థహీన్యములు నీసంసారతాపత్ర యా
స్పదమౌ లోకము మిథ్య గా దిది స్వభావంబైన సద్వస్తువం
దుదయంబైనది మృత్తికాఘటములం దున్నటిభేదంబు ను
న్నది లేదన్నది దృశ్యమాత్రములు నానారీతులన్ మాఱినన్. 366

శా. అజ్ఞాన ప్రతిబంధకంబులగు నీ యాదర్శముల్ మాని ది
వ్యజ్ఞానాత్మకమైన తెల్వి తనలో నారూఢమై యుండ బ్ర
హ్మజ్ఞానంబున దాని వేర్చితమసున్ మాయించి లక్ష్యంబులో
జిజ్ఞాసన్ గుఱిజేసి నీ మనసులో జిన్మాత్రునూహించుమీ. 367

శా. వేదాంతం బని చెప్పుమాటలు మహావిభ్రాంతి దీపించు నం
దేదో యున్న దటంచు నూరక వితర్కోచ్చావిధూతక్రియా
వాదంబుల్ సచరించు రంతయె ప్రభాభాస్వత్స్వ తంత్రైక వి
ద్యాదర్శం బగుశక్తి రానియెడ వ్యర్థాభాసమే కాదొకో. 368

శా. ఆత్మానాత్మలు రెండు వెండియు నవిద్యావిద్యలున్ రెండు జీ
వాత్మప్రత్యగభిన్నతత్త్వప్రకృతిత్వాభాసముల్ రెండు న
ధ్యాత్మైకం బగు నొక్కవస్తువుఁ దాదాత్మ్యంబు వర్తించు నీ
స్వాత్మాధ్యాయము పెద్దకష్టము పదార్థాన్యాసవాదంబునన్. 369

ఉ. కొందఱు సాధనానన నకుంఠితదివ్యపదంబు వచ్చి యా
చందము బాసెనేని మఱి స్వర్గమువీడి ధరిత్రి వచ్చు నం
చందురు తద్వివాదము మహత్తరతార్కికమైన దాపథం
బిందు వచింపరాదిది సమేశ్వర మర్థపదార్థవాదముల్. 370

ఉ. కొందఱు నూర్ధ్వలోకములకున్ జనుచుందురు కొంద రీశ్వరున్
జెందఁగఁ బోవుచుందు రని సిద్ధులు ధూమము నర్చిరాదులన్
జెందిరవిన్ సుధాకరుని జేరుదు రంటకు గూర్చుమాటలే
పొందవు జీవముక్తిని ముముక్షువు పొందు స్వతంత్రతన్నిటన్. 371

ఉ. కొందరు నూర్ధ్వలోకమునకుం జనుచుందురు ధూమమార్గులై
కొందరు స్వర్గలోకమునకున్ జనుచుందురు నర్చిరాది సం
స్పందితులై ముముక్షు లగువారలు కర్మలడించి నీశ్వరుం
జెందుదు రయ్యదే నిజము సిద్ధము సిద్ధులకెల్ల కేంద్రమై. 372

ఉ. కొందరు నూర్ధ్వలోకమునకున్ జను జీవులఁగాంచి వీరలే
ప్రమందిన మర్త్యు లంచు కొఱమాలి వచింతురు తత్త్వవేత్త లీ
చందము వాసనాసహితసంస్కృతి గాఁగ నెఱింగి దేహి సం
స్పంద తమోవిదూర మగుస్వర్గము గాంచు నటంచు సిద్ధులై. 373

ఉ. మానవుఁడై జనించి నిజమాయను దా స్వ కపోలకల్పిత
జ్ఞానము నేర్చి యీప్రకృతి సర్వము నీశ్వరరూప మంచు లో
కానకుఁ జాటెనో యపుడుగాని పదార్థయథార్థగాథలన్
దా నయిపోయి చూడఁగలదాతియె తోఁచగలే దొకింతయున్. 374

ఉ. సోదెలు చెప్పువారి కడుసూక్ష్మవిధానమె "మెస్మరిష్టు" లా
మోదమునన్ గ్రహించి పరిపూర్ణులఁ బోలె యదృశ్యవిద్య మ
ర్యాద భవిష్యదర్థముల నారయుచుందురు యోగమార్గ వి
ద్యాదయితాస్వరూపమున హాయనముల్ పదునాల్గులోకముల్. 375

సీ. సన్యాసు లున్న విజ్ఞానసాధనమహా
సంపత్తి నాత్మ లేశంబు లేదు
విద్వాంసు లున్న ప్రావీణ్యలావణ్య సం
భరిత జితేంద్రియత్వంబు లేదు
ధనికు లున్నను జీవితవిధానమునను మ
ర్యాదయి దానధర్మంబు లేదు
వక్తలు నున్న ప్రపత్తి శాంతాన్విత
ప్రాభవోపేతవర్తనము లేదు

గీ. గడుసు వేదాంతశాస్త్రార్ధ గరిమ యున్న
నిర్ధసంగపరిత్యాగసిద్ధి లేదు
కాన చెట్లున్న ఫలములు లేనియట్లు
పుణ్యశూన్యులు మోక్షంబు పొందలేరు. 376

## భక్తుఁడు

ఉ. బుద్ధుడు పెద్దకాలము ప్రబోధమతిన్ దప మాచరించి స
ద్బుద్ధిని చల్ది మజ్జిగను బోసి భుజింపగఁ జూచి శిష్యులా
పద్ధతి భగ్న సంస్కరణభావ మటంచును లేచిపోయి రా
బద్ధజితేంద్రియత్వమును బాసె నటంచును నింద సేయుచున్. 377

మ. వ్రతముల్ సంధ్యల సోమపానముల దివ్యత్వంబు రా నేర్చునో
బ్రతుకున్ జీర్ణముచేసి యీశ్వరుని నారాధించి యాస్వర్గమున్
హితమున్ మోక్షము వచ్చునో యెటులనైతే నేమి నిశ్శేషశా
శ్వత విద్యుత్ప్రతిభావిభాస మగు జీవిత్వాప్తి దర్శింపుమా. 378

శా. పూజాపద్ధతి నీవెఱుంగునెడ నీభూమిన్ బ్రదీపించి వి
భ్రాజిష్ణుత్వము గన్న నీ ప్రజల పంభావించు నీవందులోఁ
వేజంబై భవదీయ తేజమున నుత్తేజంబుఁ గల్పింపుమా
యోజన్ దేశము భాగ్యలక్ష్మి కిరవై యొప్పారుఁ గల్పాకృతిన్. 379

చ. ఒక ధనురాధికారి యగు యోగివిలాసములందు చేడ్పడన్
బకపక నవ్వి శిష్యు లెడఁబాసిన కొండొకభక్తుఁ డుండి జా
రక నెనువెంట నంటి యలరారఁగ పద్గతిఁ దెచ్చినాఁడు త
త్త్వకరణముల్ జగాన హితవార్ధిని రత్నములట్లు గ్రాలెపన్. 380

ఉ. భక్తులటంచు నేరని ప్రపత్తిఁ దలంతురొ వారు సాత్వికా
సక్తి నిజానురాగమును జ్ఞానము నేర్చి తపస్సు జేసి యా
వ్యక్తి గడించి కర్మములవాసన డించి జితేంద్రియత్వసం
సక్తిని నీశ్వరున్ దెలిసి చాటఁగఁజెల్లు యథార్థతత్త్వమున్. 381

క. కొందఱు భక్తితృణాగ్రము
నందున గల మంచుబిందువట్టుల వ్రేలం
జెందును తత్త్వము తెలిసెడు
నందాకఁ బరీక్ష కాగ రల్పజ్ఞులొగిన్. 382

ఉ. కానక పాడులోహమున ఖడ్గమొనర్చిన మంచివానె వి
జ్ఞానము నీచభావులకుఁ గల్గునె నేరక యెంతమంచి వి
ద్యానిలయంబు లున్న జలదంబు పవిత్రజలంబు లిచ్చినన్
గానను పువ్వు లొక్కయెడ కంటకముల్ జనించు నొక్కెడన్. 383

ఉ. బాధల నెల్ల నోర్చుటకుఁ బాల్పడవేని హరిప్రసంగ సం
బాధము లాలకింప కట పాదముమోపకు పాటిపోవుమ యీ
గాథ లగాధము ల్వరను గప్పినకత్తి విధానఘోరపా
థాధితపానులోఁ బడిన యోడనుబోలిన జీవితం బిదిన్. 384

మ. సెలయేఱుండెడుచోటఁ బచ్చికలు సంఛిన్నల్ ప్రియుల్ గల్గుచో
టుల బాధల్ విభవోక్తి భక్తి కలచోటుల్ నిందలున్ వచ్చు శృం
ఖలబద్ధం బిది స్వేచ్ఛ లే దవనిలో గర్వాంధులున్ సాధులన్
విలసింపన్ శ్రమ పెట్టుచుందురు తుదిన్ విధ్వంసులై పోవఁగన్ 385

శా. నీసందేశము యోగమార్గముల నెంతే నియ్యఁగా నెంచినన్
నీసంసార మపార మంచు నెదలో నిర్ధారణన్ జేసి సద్
వ్యాసంగంబుల నేర్చి ప్రాయికము బ్రహ్మానందవారాశిలో
భాసిల్ల న్నిజమాడు మూర్ఖులు నినున్ బాధించినన్ మ్రొక్కినన్. 386

చ. చెదరి వివాదమున్ దగిలి చెన్నరిపోయిన భక్తకోటినీ
సదములయోగశక్తిని ప్రశాంతిమతిన్ జడబుద్ధి మాన్పి యీ
హృదయక కవాటముల్ తెఱచి యీశ్వరరూపకళాప్రసక్తి వే
కదిపి సమాధిలో నిలిపి కాంచఁగఁజేయుము విశ్వరూపమున్. 387

సీ. కొండపైఁ గూర్చున్న గురు నిజాడ యెఱింగి
భక్తుండు నీశ్వరుఁ బడయఁ గోరి
పడరానికష్టముల్ పడిపస్తులను తీసి
యెట్టెటో కొండపై కెక్కఁజూచు
ఏనాఁటి కైనను నానాప్రయాసాల
శిథిలమై గురుని దర్శించి మ్రొక్కు
ఆగురుం డతనిప్రేమానురాగము జూడ
కొండపై నేలకుఁ గూలఁద్రోయు

గీ. అయిన విడువక గురునిపాదాంబుజముల
కొఱకు నెగఁబ్రాకి మఱల భక్తుండు కొండ
నెక్కిపోవును ప్రేమ రేకెత్తునట్లు
అట్టివారికె సాయుజ్య మబ్బగలదు. 388

చ. ఎవరు నిజానురాగమున నీశ్వరునిం గని భక్తితో జపం
జపమును ద్రోసి జ్ఞానులయి స్వార్థము రోసి గురున్ భజించి త్రో
వ వదల కంతరాయములు బాసి ప్రవృద్ధికిఁ దెత్తురో యదే
యవనికి మార్గదర్శకమతాకృతి వెల్గుచునుండు నారయన్. 389

ఉ. మంచిదొ చెడ్డదో కలము వ్రాసెడువ్రాఁతకుఁ గాగితంబు వ
ర్థించుచు బాటు నామురళి యేగతి యూదిన నట్లు పాడి రూ
పించును నీవు నీగురుని కీగతి లొంగి నిజానురాగ రా
గాంచితమైన నీమఱుగుఁ గాంచియుఁ జాటుము నీరహస్యమున్. 390

గీ. కురులమాటున సౌందర్య మిఱికి యుండు
రాత్రిచాటు ప్రభాతంబు గ్రాలుచుండు
మేఘములలోన మెఱపులు మెలఁగుచుండు
భక్తితెరయందు గలఁడు నీశ్వరుఁడు గంటె. 391

గీ. శిష్యుఁడే క్రీస్తు శిలువనేసెను తెగించి
నల మహమ్మదుశిష్యుఁడు హంతకులకు
ప్రాణములనిచ్చి నతని కాపాడినాఁడు
మతము ధర్మంబు భక్తుల పైని గలదు. 392

ఉ. సేవలు జేసిచేసి ఫలసిద్ధిని గాంచక మోసపోయి యీ
జీవిత మెట్లు సార్థకముఁ జెందునొ యన్న నితాంతభీతి నా
నావిధ తార్కికప్రవచనంబుల రోసి నిజాత్మతత్వ సం
భావిత లక్ష్యమందు భగవంతుని గాంచి తరించు నీవుగన్. 393

## * త్యాగము *

గీ. ఐహికార్థిక లబ్ధికై వ్యథలు బడఁగ
జ్ఞానరాజ్యానకై శ్రమల్ కాంచవలదె
రాళ్ళదెబ్బల గోరింట రం గొసంగు
బాధలనుబడి భక్తుఁ డీశ్వరుని గాంచు. 394

సీ. బౌద్ధుల వైదికవాదు లోడించి దే
శము వెళ్ళగొట్టించి చంపినారు
మాహమ్మదీయులు ప్రాణాలు కైస్తవుల్
క్రూసైడు యుద్ధాలఁ దీసినారు
జరథస్త్రు లధినివేశంబుల స్థాపించి
తీర్చి శైవుల కడతేర్చినారు
యూధులు పరమతబోధకులను బట్టి
కుత్తుకల్ రంపాలఁ గోసినారు

గీ. ఇట్టి మతమతాంతరవధ లెన్నొ కలవు
ఆమహారక్త పాతాల కాగకుండ
నేఁగి యెదు రీది మృతికి ఱొమ్మిచ్చినారు
వారివలె జ్ఞానసభ నిల్పవలయు మీరు. 395

ఉ. కొందఱఁ జంపినారు మఱికొందఱి నాఁ డురిదీసినారు సీ
కొందఱఁ గొట్టినారు తెగి కొందఱఁ బట్టి బహిష్కరించి రీ
చందము నెందఱిన్ వధలు సల్పినవారి తదేకదీక్ష స్వ
చ్ఛందవిహారమున్ మతవిచారము మానఁగలే దొకప్పుడున్. 396

సీ. భక్తియే ముక్తికిఁ బరమమార్గంబని
బోధింపఁ బ్రహ్లాదుఁ బొడిచినారు,
శాంతియే సతము నీశ్వరతపం బని చెప్ప
జనఁగ నేసుక్రీస్తుఁ జంపినారు,
విశ్వాసమే పరమేశ్వరుండే నని
తెలుప మన్సూరు నురిఁ దీసినారు,
ప్రేమయే నీశ్వరధామంబు వేఱు లే
దన్న లైలీవెన్నుఁ దన్నినారు,

గీ. ఇట్టి శాంతిపాఠకు లెంద ఱెందఱిట్టు
లాపదల మున్గి గాసీల నాడఁబడిరి
మొహరము కృపసైడులా శైశబుద్ధయుగము
లరసిరేనియు సెధులవ్యధలు తెలియు. 397

సీ. ఈజ్ఞానమును నేర్చియీశ్వరుఁ దర్శించి
ప్రాణాలపై యాస వదలినారు
ఈభక్తి సర్దించి యింద్రియాటవిఁ ద్రుంచి
యిహలోకవాంఛ వర్జించినారు
ఈరహస్య మెఱింగి యీర్షలఁ గడతేర్చి
జీవితంబును బూదెఁ దేసినారు
ఈతత్త్వమును నేర్చి నీతిని నెదగూర్చి
యీరేడులోకాలఁ బోరినారు

గీ. ఈమహోరూఢమార్గంబు నెఱిఁగినట్టి
వారిచర్యలె వేఱు పంసార ఘోర
వారినిధివార లున్న దుర్వారవైరి
వారములఁ గూల్చి సాక్షియై వరలుచుంద్రు. 398

ఉ. జ్ఞానము బాయుమాయునను సాధనఁ జేసిన విక్కఁగల్గ దీ
జ్ఞానము వెల్లడించుటకు సాగిన సాగదు సాగనీయ రీ
మానవు లప్డు క్రీస్తు నవమానములన్ శిల నేసినట్లు మీ
మేనులఁ జీల్చి వేతు రది మే లనువారలె మాకుఁ గావలెన్. 399

గీ. ధాన్య మెదజల్లకుండఁగా ధాన్యరాశి
బడయఁగా లేరు ; సాంబ్రాణీవాసనలను
జిమ్మఁగా లేదు నిప్పు వేసినను గాని
త్యాగమునగాని మోక్ష మేలాగు వచ్చు· 400

వ. కావున :—

ఉ. జ్ఞానులతీరు మీరు తిరగల్లను గాన్గల రాళ్ళ రోళ్ళ మీ
నులు బెట్టి యాడినను మే లని బాష్పకణాలు రాల్పకీ
జ్ఞానపథంబుఁ దెల్పుఁ డది కాచనువారలె వచ్చి నేర్చుకో
బూనెద రప్డు మీవ్యథలు పోవును పోవును కారుణీకటుల్. 401

గీ. ఇట్టిజ్ఞానంబు తెలిసినయట్టివారు
ప్రాణముల పైని యాసను వదలివేసి
త్యాగములజేసి జ్ఞానమర్యాదఁ దెలిసి
బోధ చేసిరి యూరూరుఁ బోయి తిరిగి. 402

చ. జగమున కేది హేతువో నిజంబుగ నేరును చెప్పలే రవే
నిగమములై మతంబు లయి నిర్భరదాస్యములై క్రమంబుగా
మిగిలిన జాతి జీవనపు మేరువు దండమె గూర్చివైచె నీ
పగిది తుపానులన్ సుడుల పాలయి దేశము గొడ్డుపోయెడున్. 403

శా. విద్యా లేదు కళాప్రపంచమునఁ బ్రావీణ్యంబులా సున్న సం
వేద్యంబైన నిజాత్మతత్త్వకలనావిర్భూత విజ్ఞానవై
శద్యంబుల్ గగనాభముల్ ధనము రాజ్యం బర్థసంస్కార సం
పాద్యంబుల్ మృగతృష్ణ లింక మనజీవంబుల్ వృథాభారముల్. 404

ఉ. రాజ్యము లాపలేము పరరాజుల నాజి జయింపలేము స్వా
రాజ్య సుఖంబులన్ బడయు భ్రాంతియు లేదు ప్రపంచభాగ్యముల్
పూజ్యము లింక మాకుఁ గలపూజ్యత యేమి ప్రపంచమందు ని
ర్వ్యాజ్యమునైన జ్ఞానపథమందె కృతార్థత యున్న దారయన్. 405

ఉ. ఏది నిజానురాగ మది యేది స్వతంత్రత భ్రాతృలార ! వి
ద్యాదయితాస్వరూప మవినాశిత భారతమాత నేఁడు బా
ష్పోదయనేత్రయై పలుకుచున్న దదే యెలుగెత్తి దాస్యసం
పాదిత శృంఖలావివశభారము దింపగలేరె యొక్కటై. 406

సీ. రోదసీకుహరాలు మ్రోయగాఁ జయభేరి
శరవాహినుల మ్రోలఁ దిరిగినాఁడు
శిరములు మెట్లుగాఁ జేసి స్వర్గముదాఁక
ఘంటాపథంబులు కలుపునాడు
వెండికొండను గంగ వెలిమల మరలించి
వసువులఁ బండించి మసలువాఁడు
ఆసేతు శీతాద్రి నవధరించి కళాప్ర
పంచాన కీర్తి సాధించినాఁడు

గీ. భారతీయమహామహోజ్జ్వలశశాంక
మెచట దాగెనో మేఘాల నిరికిపోయి
నేఁడు జాతీయగీతికానీకవిమల
కలశపాథోధిస్వచ్ఛమై కాంచవలదె. 407

మ. కులశీలంబులు రెండువస్తువులు మీకున్ లక్ష్యమున్ వానిలో
కులమున్ జూచిన శీలమేగునెడ సంక్షోభంబు వర్ధిల్లు వి
హ్వాల హింసావసథంబు జీవిత పథాభ్యర్థంబు త్యాగంబులోఁ
గల దామర్మమనుష్య మీశ్వరజగత్ కల్యాణముల్ గూర్పఁగన్. 407

శా. గోషా యంచును స్త్రీల మంచు నగరిన్ గూర్చున్నవృక్షా లనన్
బోషింపంబడుచుందు రందులకె కాఁబోదీ మనుష్యత్వమే
యోషల్ జ్ఞానము నేర్పి నేర్పుదురొ యీయుర్విన్ బ్రదీపించి యా
యోషల్ ధన్యలు పూర్వధర్మముల నుద్యోగించినన్ ధారినన్. 408

గీ. గ్రీసుయుద్ధంబునందు టర్కీవధూటు
లశ్వములఁ బోలెఁ దోడ్పడి యరుల గెలిచి
నిలిచి జయభేరి వాయింపఁగలిగినారు
లేనిచోఁ జచ్చియుండ్రు గోషానగళ్ల. 409

జీ వుఁ డు

చ. జడములు రెండుకా వొకటి ఛాయ; మఱొక్కటి వస్తు; వందు క
న్పడు సదసత్ప దార్థములు నైజముగాఁ దెగిపోయెనేని జీ
వుఁడు జడభావమున్ వదలిపోవును విత్తును వీఁడు మొక్కకై
వడి ఫలసిద్ధివాసనలు పర్వెడు తేజము వచ్చు నాత్మకున్. 410

ఉ. కొందఱు పూర్వజన్మయని కొందఱు పాపముపుణ్యమందురా
చంద మెఱుంగనేర కొకసారి నశించిన వృత్తి రెండుగాఁ
జెందును దాని నొక్కయెడఁ జేర్చుట కెవ్వరివల్ల గాదు ని
ష్పందనిరీహనిర్వృతనిపాతములన్ జడజన్మకర్మలన్. 411

ఉ. జ్యోతిషు లంద్రు మానవులు నుర్విని చచ్చియు నుర్విఁ బుట్టుచుం
ద్రీతములైన కర్మఫలరీతి వహింతు రటంచు దైనికుల్
భూతలమందు మృత్యుహతిఁ బోయిన వారలు నొక్కసారిగా
వేతురటందురీ ప్రళయ లీలసమానమె యేరుచెప్పినన్. 412

శా. ఆలోచింపరు మూర్ఖమానవు లవిద్యాభ్రాంతి విశ్వంబుఁగా
నాలోకింత్రు మునుంగుచీఁకటి ప్రభాధ్యాసంబు లీరీతి వి
ద్యాలంకార రసాత్మకం బయినవ్యాఖ్యానంబులోఁదోఁచు నా
నాలక్ష్యంబులఁ బుట్టుజచ్చు తనువున్ జన్మాంతరంబే గదా. 413

ఉ. పాపము పుణ్య మంచుఁ బరిపాటిగఁ జెప్పెడుమాటలందు నీ
చూపు పదార్థవాదములఁ జూచుచున్నది ఖేదమోదమం
దాపరమార్థవాదము పరాపరమైన త్వదాత్మ మోక్షపున్
రూపము దాల్పదేని యదె రూఢిగ పాపము వేరయున్నదే. 414

ఉ. ఊహలు వానిలోఁ గలుగు నున్నతమార్గము నున్న యున్న సం
దేహము బాయకున్న మఱి తీరుట యెట్లని తోఁచెనేని నీ
దేహమునందు జీవుఁ డను తెల్వియు స్వప్నములందు నీవు నీ
మోహనవిగ్రహంబుఁ గని పోల్చఁగలేవొకొ నీరహస్యముల్. 415

ఉ. చావును పుట్టుకన్ గలుగు సత్యమునేరుసు చెప్పలేరె యీ
వావును కాలవాహిని వెసన్ గలిగించుచు నున్న మార్పు చీ
వావసదంబు యోజనశతాధికమై భయదంబుఁ గూర్చు నీ
తావు రథాంగమట్లు నిరతంబుఁ బరిభ్రమణంబుఁ గాంచెడున్. 416

శా. ఏదోదారిని త్రొక్కిపోమ్ము తుద కేదేవో ఘటస్థింప నా
మోదంబో వ్యసనంబొ దానికయి నీబుద్ధిన్ వితర్కింప కా
పాదింపంబడు నెల్ల యేవిధమునో వచ్చున్ బ్రయత్నింపితే
రా దీయర్థము కర్మబద్ధము ఘటప్రారబ్ధ మీభోగముల్. 417

శా. రాలున్ జెట్లులు జీవరాశులు జడప్రాయంబు లౌ వస్తువుల్
కాలోద్ధూతహతిన్ మరల్చి యెపుడో కల్యాణసంధాయకా
భీలంబైన మనుష్యరూపములు ప్రాప్తించున్ దదర్ధాంత ర
శ్రీలావణ్యపదై కతత్త్వగతి నిశ్శ్రేషంబు సంధించెడున్. 418

చ. జగ మది మాయనాటకము జచ్చుటొ పుట్టుటొ యన్న నీమహా
విగతగతాగతం బయిన వేదనలందు ఫలంబు లెవ్వరున్
దెగి వచియింపలేదు మఱి తీరనికర్మ ఫలాప్తి బంధమే
యగునెడ మోక్ష మెప్పు డది యబ్బని దేనిప్రయత్న మేటికిన్. 419

ఉ. తప్పుకొనంగలే మెచట దాఁగిన నొప్టను నన్న కష్టముల్
తప్పవు కాలగర్భమున దాఁగొనియుండి భవిష్యదర్థముల్
చెప్పిడిదేమి జ్యోతిషలు చెప్పిన బెంగకెగాని వానిలో
ముప్పులు పోవునొక్కతపమున్ దొలఁగించును కర్మబంధముల్. 420

శా. ప్రాప్తబంచును కొంద ఱాడుదురు కర్మం బందు రాకొందఱున్
ప్రాప్తాప్రాప్తము లేగుచుండును ఘటప్రారబ్ధమందందు రీ
సుప్తిన్ బోలెడు జీవితంబునకు నీశోకంబు లేలా హఠాత్
తృప్తిన్ గల్గెడు నెండవానలటు నీసృష్టిన్ గతం బేమిటో. 421

చ. కడలితరంగవేగమున గట్టునుదాఁటి ధరిత్రి మ్రింగఁగా
వెడలునుగాని కాల మటు వీఁగఁగనీయదు ఘోషపెట్టు మ
ర్త్యుఁడు కబళింపఁజూచునటు రోదసికాని హఠాత్పడై వడిన్
బుడమికి రాలు కర్మఫలమున్ విధి చయిము దాఁటవచ్చునే. 422

మ. నరజన్మంబు కెన్నొబాధలు ప్రధానంబై వ్యథన్ గూర్చు యే
పరమార్థంబును లేదు వాంఛలు సముత్పాతంబులై వచ్చు నా
మరణం బావల జన్మకర్మ కలవో మాయింపునో చెప్పలే
రరయన్ జచ్చెడివారు బుట్టుటకు నేలా యిట్లు వాదింతురో. 423

శా. ఏదో బావని వస్తు వీతనువులో నెచ్చోటనో యున్నదా
భేదగ్రాహ్యకమౌ రహస్యమును నిర్భేదించి బోధింపవా
రేదో యల్ల సుషుమ్నలో కనుమఁ డటం బేమేమొ సూచింతురా
వాదంబందు సుషుమ్నఁ జూపవలదా బ్రహ్మంబు తానొటకున్. 424

ఉ. జీవుఁడు నిండుదేహమునఁ జేడ్పడి యుండెనొ లేక పట్టిమి
థ్యావృతమైన క్లేశముల నారడిఁ జెందుచునున్న వాఁడొ తత్
భావభవాభవం బయినపద్ధతులన్ మరణించి పుట్టఁగా
నేవిధమైన వస్తువున కీ యగపాటులొ చెప్ప రెవ్వరున్. 425

ఉ. జీవుఁడు జీరిజన్మలకుఁ జేరు నటంచును జెప్పుమాటలం
దేవియొ కొన్ని వాస్తవములే కలవైనను జీవనిర్ణయం
బేవిధిఁ జేయఁగాఁగలము జీవుఁ డెవండొ నెవండు జన్మజ
న్మావిలకర్మబద్ధుఁడయి మాయుచునుండెనొ కానఁగావలెన్. 426

ఉ. జీవుఁడు పుణ్యపాతములఁ జెందఁడు కర్మలు ఛాయమాత్రమై
భావమునందు మార్చు పరిపాటిగఁ బెట్టి నశించిపోవు వి
ద్యావసథంబులైన మహిమాస్పదమంధు మనస్సు జేర్చి నీ
తావున నీవు నీతెలివి తప్పకదే యమృతంబు ముక్తి యగున్. 427

చ. అది హృదయానుషంగ మగునట్టి యథార్థము దృష్టిగోచరా
స్పదములు దానినుండి వెలువడ్డవి మిధ్యనుబోలి మాయలో
మొదలు పునాది పెట్టి తనముందర మోహనరూప వైఖరిన్
కదలుచు జీవసౌజ్ఞఁ బొఁడగాంచెడు వ్యక్తియదే యెఱింగినన్. 428

—♦ రాగము ♦—

చ. మధువును ద్రావి త్రావి మఱి మైకమునన్ దెగ వాగువాని వా
జ్మధుర సుధాసంబునఁ బ్రకాశితమైన నవీనగాన మా
పథికుఁడు లెక్క సేయకల పాటలలోని కవిత్వ శిల్ప మె
వ్విధిఁ గననేర్చునో యటుల విశ్వముగా నిను గాంచ మన్నిటన్. 429

చ. అది మధుపంబుసంపెఁగలయందు మధూత్వము లేదటంచు రా
దది మధుసేవకున్ మఱిగి యర్థపశూత్వము గాంచె వాసనా
స్పద మహనీయ వైభవ రసప్రతిపాదకదివ్యశాంతి నె
మ్మది బడయంగఁజాల దధి మానసికంబు స్వతంత్రభావమున్. 430

చ. శలభము దీపమున్ గని ప్రశాంతరసానుభవంబులో మహా
సులభము నైన దివ్యఫలశోభ వహించెద నన్న మాహచే
కలవరమంద దీపకళికాకలనంబున ప్రాణ మిచ్చి యా
విలయము ప్రేమపాఠములఁ బెట్టి యదే వినిపించుఁ జూచితే. 431

శా. వేళాకోళము జేయ నంటి విభవత్ ప్రేమైకపాఠాల రా
గాలాపంబులచే నచేతనహృదాగారాలు ద్వారాలు నీ
కేలన్ దాళము వేసెదే యిది మహా! క్లిష్టంబు యీముళ్ళు నీ
రేలన్ విప్పు స్వకీయగానకలనన్ రే పన్న దే యున్న దే. 432

ఉ. వాదము లాడియాడి పరవంచనలన్ దెగసాగి జ్ఞానమ
ర్యాద నశించ జీవితమహత్తర భాండము నేల మోది యా
మోదము బాసిపోవుటకుఁ బుట్టితివా సరిగాదు నీమనః
ఖేదము తెంపు లేని దధి క్రిందగు నీ సుర ద్రావు మాయెడన్. 433

ఉ. ఓకవి! నీవు నూత్నము మహోన్నతభావము లేవొ వ్రాయఁగా
వ్యాకులమొందు చుంటి వదివ్యర్థము నీకలమందు భారతీ
శ్రీకలనం బయాచిత వశీకృత రీతిరచించు రాగగం
గాక నదుజ్జ్వలంబయిన కాంతులు సంధ్యల మేళవింపగన్. 434

శా. యోగంబుల్ జపముల్ తపస్సులును సంధ్యోపాసనాది క్రియా
త్యాగంబుల్ భవదీయసత్యమున ప్రాధాన్యంబు గానేర వా
రాగోన్మాదక మద్యభాండముల సంప్రాప్తంబులై యొప్పుద
ద్రాగంటుల్ విడఁనాడి నీ వనెడు తత్త్వంబర్థి దర్శింపుమా. 435

ఉ. ఈయెల జవ్వనంబు నిదురించెడు వెన్నెలయందు బెట్టి మై
రేయముద్రావి మైకమున రేపును మాపువిలాసలాస్యమౌ
రీయత వెన్నుపూస సడలింపక పూర్వమె లేచి నీకళా
ఛాయయము ప్రేమ పాఠములయందు మురింయము సంతసించుచున్. 436

శా. రక్తంబేరులు పాఱుపోరు హేలముల్ రాగాల కేదారముల్
ముక్తాభంబులు పండభక్ష్యములగా మోసెత్తజీవాణుకా
వ్యక్తిన్ విశ్వకుటుంబ మేర్పడెడు నశ్యంబాస్తికాభాస సం
సక్తిన్ బంధము మోక్షరూపమమృతాక్షయ్యంబు గావించెడున్. 437

శా. కాషాయాంబరధారివై తివి మహాకళ్యాణ రాగాంచి త
ద్వేషంబైన వివేకమున్నదను సందేశంబు చాటింతువా
మోహారత్నము పానపాత్రనిడు పీయూషంబు నాశించి గీ
ర్భాషాపాదరజంబు మ్రొక్కెదవు నీ స్వర్గంబు నిక్కంబొకో. 438

ఉ. ప్రేమను నిల్పి రాథతన తెప్పమరల్పక శూన్యమందునా
నామహితాకృతిన్ దగిలి నాథునికన్నులఁ గాంచెనట్లు నీ
వేమి తలంచితే యదియు నీవనుకొన్నది చూఁడవచ్చు రా
వేమినిజార్థమున్ చదువవేమి ప్రభాతములంటు దాగముల్. 439

చ. అభము శుభంబునేరని నిరాశయమాయకమైన భక్తి నీ
యుభయ జగంబులున్ మెఱసి యుజ్జ్వలకాంతిరస స్వరూపసౌ
రభమును దాల్చి ప్రేమజలరాశినిద్రవ్చి యమూల్యరత్న స
న్నిభ మహనీయబ్రహ్మపద నిర్వృతివచ్చు సుధాసమగ్రమై. 440

ఉ. మాయను నీవు మెచ్చుకొని మాయను నీవు తొలంగలేక యె
న్నో యగచాటులం బడుచునుంటివిచాలు స్వయంకృతాపరా
ధాయతమైన యానిశి నధఃపతితంబును జేసివేసి మై
రేయము దిక్ప్రభాతసమరేఖల దాఁగె గ్రహించు తోషివై. 441

ఉ. నిజములు కొన్ని చెప్పుటకు నేర్చినలోకము నమ్మనంచు నా
నిజములు దాచివేసి యవి నిందిత వాగ్రచనాచమత్కృతిన్
ప్రజలకుఁ జూపఁగావలసె భావము విప్పకబ్రహ్మవిద్యయే
విజనదరీగిరిశిఖర వీధులు లెన్నగఁ దోచెఁ జెప్పఁగన్. 442

## —♦ జ టా దే శ ము ♦—

ఉ. నరకము స్వర్గమున్నది జనప్రకరంబులు పాపపుణ్యముల్
పొరయఁగ రాజకీయములఁ బోలెడు నీ యధికార మెప్పు డె
వ్వరుకి కుదింతురీ రుధిరవారిధి మానవుఁ డొక్కనావయై
తరఁగలఁ దేలిపోఁగలఁడె తార్కికుడై జడబుద్ధి వీడఁగన్. 443

గీ. పట్టెడన్నంబు దొరికిన పాటవేసి
తట్టెడన్నంబు గైకొనఁ దలఁచెదేల
లభ్యములుమాని పేరాస లాతివాని
పాదధూళిని నెత్తిపై ప్రామికొనకు. 444

ఉ. వసుధను సూర్యుఁడే దిరిగి వచ్చునో సూర్యునిచుట్టు నీమహో
వసుధయె చుట్టివచ్చునొ ప్రపంచపు విద్యలు చెప్పలేక యా
కసమును చూచుచున్నవి వికావికలై మహనీయ మీ స్వరా
వసథము చెప్పుటెట్లు రసవాదము లెన్నిటినేర్చి వచ్చినన్. 445

శా. ఏండ్లా! క్రిందకు జారిపోయినవి యెన్నేండ్లైన నీవిశ్వమున్
కండ్లారన్ గనుచుండ జవ్వనము శృంగారంబు రూపించు నీ
యిండ్లున్ వాకళులందకత్తెలు స్వతంత్రేచ్ఛావిహారక్రియల్
పండ్లుంబడిన చెట్లగా ననుభవింపన్ రావు నానాఁటికిన్. 446

ఉ. ఏటికి వామమార్గములు నింపులు సొంపులు గూర్చి చెప్పి నా
నాఁటికి పుణ్యలోకమును నాశముసేయుము వింకనీకు నే
నాఁటికినైన పుట్టుగతి నాకము లక్కఱలేదె యయ్యయో
కాటికికాళ్లుచాచి యొడికంబునఁ దీసుకుపోదె లోకమున్. 447

మ. అపమార్గం బవినీతి నీతియని దుర్వ్యాఖ్యానమున్ సేయు నీ
కృపణత్వంబునకున్ క్షమార్పణము లేనేలేదు నీవెన్ని నా
ళ్లుపవాసాది తపస్సమాధులను నుద్యోగించి కావించినన్
అపవర్గంబును జేరనేరవు వృథాయాసప్రగల్భంబులన్ 448

శా. వేదాంతంబని కొంద రీశ్వరజగత్ విభ్రాంతవాదంబులోఁ
బాదంబుంచియిహంబు మోక్షములకున్ బాడై మనచ్ఛక్తి సం
పాదింపన్ జనకేవొ పొల్లుపదముల్ వల్లించి యోగక్షయం
బౌదారిన్ బడి మోసపోయి పయిగా నార్తుర్ గదా ధీరులన్. 449

మ. తపముల్ చేసి స్వతంత్రుపై దివిని సందర్శించు వారుండ యే
తపముల్ సేయక సాధుసేవ భజనాదర్శంబుల న్నమ్మి మే
మపవర్గంబు గ్రహింపనుంటిమి హరి ధ్యానంబు ముఖ్యంబు త
త్కృపయే బంధవిముక్తి హేతువనుతృప్తిన్ గొందఱున్నారిసీ. 450

ఉ. సాధనఁ జేసి చేసి నిజసంగతి నేరకముగ్ధుఁడై మహా
గాధలఁ జెంది యైహికము గాఁబరతత్త్వము మార్చి ధర్మసం
బాధకమైన ధూమపథపద్ధతిచెప్పు నిషిద్ధజీవితా
రాధనజేయఁ బోకు మదిరంబు సుధామధురంబు బోలునే. 451

చ. జడములతోడ సామ్యములు చాటుచు పోయిన లాభమేమి నీ
జడతనుబాసి యీశ్వరుని సన్నిధి భక్తిరసార్ణవంబులో
పడవనుబోలె పోవుచును పాడుము నీమహానీయ గాన మే
ర్పడఁగ త్వదీయజీవమధు పాత్రము బద్దలుకాక పూర్వమే. 452

ఉ. రాగల మంచిచెడ్డలను రావలదన్నను రాకపోవు త
ద్యోగము జన్మకర్మల నున్నదటంచును జెప్పుచుండు రే
లాగయినన్ జడప్రకృతి లభ్య జయాపజయంబులైన దా
రాగమునందు భంగపడరాదు తపస్వి స్వతంత్రుఁ డన్నిఁటన్. 453

ఉ. ఎల్లరు కోరుచుందురు నతేంద్రియమైన మహాఫలంబులం
దెల్లరు పొందురేని యది యేదియు మోదముఁ గూర్చఁజాల దీ
యుల్లము రాని వస్తువున కువ్విళులూరును వచ్చెనేని రా
జిల్లఁగ క్రొత్తవస్తువుల చింతనొనర్చు జడత్వమేర్పడన్. 454

ఉ. తాను నిషిద్ధజీవనవి తానములన్ జెడవచ్చు నన్యు నె
వ్వానిని పాడుసేయుటకుఁ బాల్పడరాదు వధూటులందు నే
దేని మలీమసంబగునభీష్టము నుంచినవాఁడు రౌరవా
ధీనమహాగ్నిలో మునిఁగి తేలఁగలేఁడల కోటిజన్మలన్. 455

ఉ. మీరు వచించుస్వర్గము లభించిన నచ్చటి చారునిర్ఝరీ
వారము స్వర్ణసౌధపరివారము సుందరవన్యకామినీ
కారణమైన మోహ మమకారవికారము కొన్నినాళ్ళకున్
జారిన బంధమందు ధిగఁజారెధ రీసుడి తప్పనేర్చునే 456

ఉ. నీకొలబద్ధతో జగము నీరధి కొల్వఁగఁ బోయెదేల యా
లోకనయందు మానసికలోపములేల కుదుర్చుపోవు; ఆ
హా! కులపర్వతంబులను నచ్చనగాయలు జేయనేర్చు వి
ద్యాకలనంబు నేర్చుకొను మయ్యది నీ పను వ్యక్తినుండెడున్. 457

ఉ. నీ వనుకున్న దివ్యమహనీయపదంబులు స్వర్గలక్ష్మికిన్
గావు పదార్థవంచనలఁ గాంచి రహస్యనిమీలితంబులై
కేవల కల్పనాస్పద వికీర్ణకలాపకృతప్రవృత్తి నా
నావిధవస్తుసంగమ వినాశనమైన విముక్తి నిచ్చెడున్. 458

ఉ. నీవలె శూన్యవాదములు నేర్చినమేమును జెప్పనేర్తుమా
త్రోవ పదార్థవంచక ముతోభయదం బయి స్వప్రయోజనా
భావమలీమసం బయిన పంథకృతాంతనిశాంతవీధికిన్
దావలమందు లోఁబడి మతంబు హితంబు పరిత్యజింతువే. 459

ఉ. నీవును మేము నొక్కపరమేశ్వరునే గనుచుంటి మందులో
నీవు జడస్వభావమును నింద్యములైన నిషేధవస్తువుల్
కావలె నందు వైహికము కామ్యములన్ విడనాఁడి యందు సం
భావిత మైనతేజమును బట్టుము సిద్ధుఁడ వయ్యె దన్నిటన్. 460

ఉ. ఆశవమున్ వధూటియు విహారవిలాస సరిత్తటాకసం
వాసిత సౌధపంక్తి పరివర్తిత గానరసైకసాధనో
పాసిత భాసమానములు ప్రాయము పోయిన నందమియ్యవా
యాసలు నీరసంబు లడియాసలు భగ్నమనోరథంబులున్. 461

మ. మధువున్ మాంసము మాని నీశతము నిమ్నత్వంబులున్ యోగికిన్
విధియున్ పెద్దనిషేధమున్ గలవిగా ద్వేషింపరా దందు రా
పథమున్ జెల్లు సరే గుణత్రితయముల్ వర్జించినన్ గాని యా
యధముల్ నేరరు తత్త్వమార్గము విశుద్ధార్థంబులన్గాంచఁగన్. 462

శా. ఎన్నోప్రాణము లెన్నొజీవులు ధరిత్రీగర్భమం దేగు నం
దున్నాయో మఱి లేచిపోయినవొ యోమో చెప్పఁగాలేము మే
మన్నన్ జీవికి శాశ్వతత్త్వమును విద్యాతత్వమున్ నేర్పని
ర్భిన్నంబైన పథంబు గూర్చుటకు నర్థిన్ జూతు మెల్లప్పుడున్. 463

ఉ. పెద్దయెలుంగు రాలుపడ పేరురముల్ పెకలించునట్టు లీ
మొద్దులు కూయుచున్న వవి మోక్షమునొందుట యెప్పుడోయటం
చద్ది స్వదగ్ధమై యనలమందు జడత్వము వాసెనేని యా
ప్రొద్దు స్వకీయతేజ మపరోధము జెందని శాంతి వచ్చెడున్. 464

మ. ఉపవాసంబు తపస్సమాధి జపసంధ్యోపాస్తి యధ్యాత్మత
త్త్వపథార్థప్రతిపాదకం బయిన దివ్యజ్యోత్స్న వీక్షింపఁగా
నుపయోగంబులు కావు జీవుని శరీరోన్మాదమందుండి లా
గి పరబ్రహ్మనుగాఁగ తన్నుగను యోగీంద్రుండు వీక్షించెపన్ 465

ఉ. జ్ఞానము నీశ్వరున్ దెలిసి కర్మల డించి తదీయశక్తి వి
న్నాణమునన్ జడత్వము గుణప్రతిపాదకమైన వీఁకటిన్
భానునిబోలెఁ బోనడచు భావనిమీలిత బ్రహ్మతత్త్వ మీ
వేనసు తెల్వితెచ్చును నంతేంద్రియముల్ గనుపించునట్లుగన్ 466

-* మానవుఁడు *-

చ. అణుమయ మీప్రపంచకము నం దవి మాఱి మనుష్యరూపమై
యణువులనే గ్రహించునది యన్నముగాఁ బురుషుండు వానిలో
నణఁగిన స్వస్వరూప మగునగ్ని గ్రహించును నామహాగ్నిలో
తన మహనీయమైన స్వపదంబును గాంచు నదే విముక్తిగన్. 467

ఉ. సాధనఁ జేసిచేసి తనసంగతి నేరక పెద్దకాలమున్
గాధలఁ జెంది పూర్వకృతకర్మల బాసెడుత్రోవఁ గాన క
య్యో ! ధనదారలన్ మఱఁగి యుర్వినిబాసి నశించిపోవు నీ
బాధలు నెన్నినాళ్లు బడవచ్చునో భ్రాంతిని తన్ను గానకన్. 468

ఉ. ఈశ్వరు నెలకో వెదకె దీ వతఁ డీసచరాచరంబులో
శశ్వదసూనతేజమునఁ జక్కఁగఁ గన్పడుచున్నవాఁడు నీ
విశ్వము వాఁడె వాడె మనవిశ్వము గావున చింతలేదు నీ
శాశ్వితమానవత్వ మరచాటున నున్నది దానిగూర్చుమా. 469

శా. ఆలోచించెద వేల నీబ్రతుకులో నత్యంతకల్యాణ వి
ద్యాలావణ్యము గల్గుజోస్యమున కాయజ్ఞానమే క్రిందిమె
ట్లాలోకింపఁగ సేయు నైచ్య మగునూహన్ సేయఁగాఁజెల్ల దే
వేళన్ తృప్తిఘటించు మానసము కువ్విళ్లూరుచందంబునన్. 470

శా. అదిగో! సంతక్రయాక్రయంబుల నిబద్ధాసక్తి వర్తించు సం
పదలన్ పర్యవసాన మెయ్యదొ ఫలాభావంబు వర్ణింప ద
గ్గది కన్పించదు కాని వానివిధముల్ కర్మానుగుణ్యంబులై
కదియు గావున మానవుండు విధి ధిఃక్కారింపఁగా నేర్చునే. 471

శా. నక్షత్రంబులఁ బుట్టుమానవుల తన్నక్షత్రసంచార మే
సాక్షాన్మానవజీవనాటకముగాఁ జ్యోతిష్యముల్ వ్రాసిరా
దీక్షన్ మర్త్యుఁడు కీలుబొమ్మ యగుచో దివ్యత్వమున్వ్యక్తి సా
పేక్షంబై జను బంధ మోక్షములు మృద్వీథుల్ వితర్కించినన్. 472

ఉ. మానవుఁడై లిఖించునది మంచిరసాన్వితవాఙ్మయంబు వి
ద్యానవకావ్యపద్ధతుల నందఁగవచ్చును గాని బ్రహ్మవి
జ్ఞానపరంపరం బయినసంగతి దానికదే స్ఫురించి యా
నౌ నని వచ్చి చెప్పును పరాపరమర్త్యరహస్య మారయన్. 473

ఉ. మానవజన్మ మంచి దని మాటికిఁ జెప్పుచునుంద్రు గాని యీ
మానవజన్మకెన్ని యవమానము లున్నవి ముప్పు లున్న వీ
కానల నెల్ల దాటి కుతుకంబున బంధములవ్రాసి వ్రాసిమై
జ్ఞానపథాన నీశ్వరుని గాంచినఁగాదె కృతార్థు లావ్రజల్. 474

## —♦ గురువు ♦—

గీ. రామునకు వశిష్ఠుఁడు బలరామకృష్ణు
లకును సాందీపుఁ డారసూల్ స్వామి కరయ
గేబ్రిలును విద్యనేర్చె రాశీలు తెలియ
లేనివారలు జ్ఞానంబు లేనివారు. 475

గీ. బోధకునిబట్టి జ్ఞానావబోధమైన
శక్తి యేర్పడుచుండు స్వశక్తివలన
నేమహావిద్య రాఁబోవ దెవరికైన
ఆర్యయును నేర్వవలసె నధ్యాత్మవిద్య. 476

గీ. ఎవరిశిష్యులు ననురాగ మెసక మెసఁగ
ప్రాణముల నిచ్చి మతము కాపాడినారొ
అమతంబులె నాదర్శ మయ్యె ధరణి
తక్కినవి నిమ్నలోకాలఁ ద్రొక్కవడయె. 477

చ. అల మనుసూరు నేనె హరి నంచు వచింపఁగ నాఁటిరాజు వి
హ్వలమతి కూడదంచు కబు రంపెను గాని నతంచు మానలే
దలిగి నృపుండు వాని నురియం దిడె కాని యతంచు బ్రహ్మగాఁ
బలుకుట మానఁడయ్యె నదె భక్తిస్వతంత్రత నాత్మశక్తియున్. 478

## —♦ నింద్యులు ♦—

చ. నిజములు చెప్పి నప్పు డవి నింద్యములైనవిగా గ్రహించి యీ
ప్రజలు వివాదవీచికలపా లయి నేరక కుమ్ములాడుమన్
రజమయిపోదు రాతెఱవు గానక నీస్వపథంబు; ముక్తినిన్
విజయ మొనర్చునట్లు ఫలవిభ్రూతి గాంచుము తప్పకుండఁగన్. 479

చ. గజము పలాయనంబులను కారణకార్యము మిథ్యలన్న నా
నిజము స్వయంప్రభావులకు నేర్పెడుపాఠమె కాని లోకమం
దజగరలభ్యభక్ష్య మశనాశస్వలాభము మాటుచేసి యీ
ప్రజమిషలల్లు వానిని ప్రపంచము మెచ్చెడు వాస్తవంబుగన్. 480

ఉ. మావిషయంబు చెప్పుచును మాపును రేపును నిందసేయు మీ
భావము మార్చుకొండు హరిభక్తినిగన్న తపస్సమాధిలోఁ
ద్రోవ నెఱింగి యానెపముతో పరమాత్మను గాంచిరేని మా
తావును జేరుకొందు రిఁక దాఁగొనఁగా తలమేది రోపసిన్. 481

మ. గురులన్ భక్తుల నిందజేయుదురు పుర్గుంబోలు దుష్టాత్ము లా
మెఱుగుం గుక్కలనోళ్లు కట్టుటకు నేమోపెద్దకార్యంబు గా
దరయన్ దీపముజన్చుపుర్వులన దహ్యం బౌదు రాధ్యాత్మత
త్త్వరహస్యం బగుశక్తి చూపినఁ గులధ్వంసంబు గావింపదే. 482

ఉ. భగవంతుం డొకమానవాకృతిని సంభావించి సాష్టాంగమొ
ప్పఁగఁ గావించుఁడ టంచు దేవతలతోఁ బల్కెన్ 'ఆజాజీ' లొగిన్
జగడం బాడెను పూజ్యుఁడే నని యదే సైతానుగా వాని మా
ర్చె గురున్ మార్కొనువారు పాతకులుగారే యేకళన్ నేర్చినన్. 483

ఉ. క్రీస్తుని గన్నతల్లి పరికింపఁగ శంకరుఁగన్నతల్లి జో
రాస్తరుతల్లి యార్షకులరాశిని గాంచినతల్లు లెల్లరున్
నిస్తులపుణ్యశీల లవినీత లటంచును పాపు లాడినన్
వాస్తవ మందు వారిగుణవర్తన చెప్పకచెప్పు పూతమున్. 484

## -* అ న్యా ప దే శ ము *-

ఉ. బంధము మోక్షవాంఛ నిడవచ్చును మోక్షము బంధవాంఛ సం
బంధము పెట్టుకోదు భవబంధము వాసినవారు వాంఛ గా
ఢాంధతమస్సులో వెలుఁగునందు సుఖైకరసానుభూతి ని
ర్బంధము లేని యాయమృతరాశి యథేచ్ఛను నుందురేయెడన్. 485

చ. నరకము స్వర్గమున్నది జనప్రకరంబులు పాపపుణ్యముల్
బొరయఁగ రాజకీయములఁబోలెడు నీయధికార మెచ్చ టె
వ్వరు కికురింతు రీరుధిరవార్ధిని మానవుఁ డొక్కనావ యై
నరకము స్వర్గవీథులఁ గనన్ జనునే యని సంఘటించినన్. 486

గీ. చిత్రలేఖకుఁడా! నీవు చిత్ర చిత్ర
మైనబొమ్మలు వేసి వ్యాఖ్యాత వగుచు
పొంగుచున్నావు గాని నీ బొమ్మవేసి
చూచుకొనవేమినీలోని సోయగంబు. 487

చ. కవితను నీవు చెప్పదని గర్వము జెందుచునుంటివేమొ యా
కవిత చరాచరప్రకృతికై యొనరించెద రీసుమంబు నీ
కవితను జూచి నవ్వును పికంబు కుహూ యని వెక్కిరించు ను
త్సవము కళాప్రపంచ మని చాటకు మానసికంబు నెచ్చెలీ! 488

శా. ఆలోచింపుచు ద్రాళ్లపేనుచును భూమ్యాకాశమధ్యంబునన్
ప్రేలాలన్ జనుచుంటి వర్భకునిగా విశ్వంబు నీచైదముల్
వేళాకోళముసేయు నం చెఱుఁగవో విభ్రాంతి విజ్ఞానికా
బోలన్ జూచెదవా! జడప్రకృతి మున్ బోనాఁడు మేనాఁటికిన్. 489

శా. మైరేయంబును పువ్వుబోఁడి యొసఁగన్ మైకానవిశ్వంబు శృం
గారాగారముగా వినోదమతివై గానంబు గావింతు వ
య్యో! రాగాలు నిశాకవాటముల ప్రత్యుద్ధానమున్ జేసి నీ
తీరున్ డప్పున పాటు కాలనిహతిన్ దిమ్మెత్తిపోరాగలన్. 490

ఉ. కోకిల కంఠమెత్తి తనకున్ గలగానరసంబు యోగి కా
లోకనమైన తన్మురళిలోఁ గలపన్ గలపెట్టిగాని యా
మ్రాకు చిగుర్చుదాఁకఁ ధనమాధురి యేరులతోడ పాతి చీ
కాకు వదల్చు నంచు తన కాకలికాస్వర మాపవచ్చునే. 491

—* హం స *—

శా. ఆధారాదిక చక్రషట్కమున సోహంనాదపాఠంబు వి
ద్యాధుర్యంబుగ పాడనేర్చు నెడ బ్రహ్మాండబు రూపించు నా
నాధిక్కార తమోనివృంతవిగళన్నాదంబు పోకార్చి జ్ఞా
నాధిక్యంబగు తేజ మేర్పడును బ్రహ్మానందవారాశియై. 492

శా. హంసల్ బైకి మరల్చు నాతెరవు సంధ్యావ్యాహృతుల్ దోఁచఁ బ్ర
ధ్వంసాభావము ప్రాగభావ మనుచున్ దర్శించు తల్లక్షణో
త్తంసంబైన నుపాధి తేజమున ప్రత్యగ్లీనమై కుండలిం
హింసన్ బాపి సుషుమ్నలో వెలుఁగు నూహించున్ గళాలోకమై 493

శా. హంసన్ జక్రములందు ద్రిప్పిన రహస్యం బాసుషుమ్నాంతరో
త్తంసంబైనవెలుంగు వచ్చి నిశిలో దాగొన్న జీవస్వరూ
పాంసన్ గాటుకపట్టియున్న మతి నత్యంతంబు త్రైగుణ్యవి
ధ్వంసంబున్ బొనరించుచీఁకటి ప్రభాతంబట్లు మాయించుచున్. 494

ఉ. హంస నహర్నిశంబు హృదయంబునఁ బట్టి సుషుమ్న నెట్టియు
త్తంసతరేచకం బెగయ ధారణయం దలపూరకంబుతో
హంసిని చక్కఁబెట్టి తనయందు లయంబగు దృష్టి నిల్పి వి
ధ్వంస తమోనికృంత నిరతం బయి నిన్గవచ్చు సృష్టిగన్. 495

శా. ఈహంస న్నిటలంబుపై నిలిపి తద్దృష్టిన్సహస్రారమం
దీహావృంతము తృంపివేసి యజపానిస్ప్రాణముల్ మ్రోయ నం
దూహన్ మ్రాన్పడ శింపపూరమున తేజోద్ధారకం బైన ప్ర
త్యాహారంబు హఠంబు వచ్చునదె ప్రాణాయామమై మారెడున్. 496

శా. హంసన్ శ్వాస మరల్చి యాతలఁపునం దాలక్ష్యభావంబు ను
త్తంసంబైన సుషుమ్న నాళమున చైతన్యంబు సంధించి వి
ధ్వంసావాప్తి సహస్రమం దెగయు నాదం బందు గీతార్థముల్
సంసక్తిన్ వినిపించు కిన్నెరవధూ స్వర్గీయగానంబుగన్. 497

ఉ. సోహము హంసనాదమున శోభితమై యల రేచ కైక సం
దోహము పూరకంబున నధోముఖమై జని యాఱుచక్రముల్
కూహకమైనమార్గమునఁ గూడి సహస్రముదాఁక లేవి యా
వాహనఁ దెచ్చి కుంభకమువంక మరల్చు సమాధిసిద్ధికిన్. 498

శా. ఈషట్కంబును గానుగెద్దువలె నెంతే ద్రిప్పు నీహంసయం
దీషన్మాత్రము మార్పువచ్చిన గళన్మృత్పాత్రలో నీరు త
త్పాపాణంబులఁ జిందుకై వడి ఘటప్రారబ్ధముల్ పోయి ప్రా
గ్దోషంబుల్ హరియించుపూరకముతోఁ గుంభించఁగాఁగల్గినన్. 499

శా. ఆషడ్చక్రములందు హంస నటు బాహ్యాభ్యాంతరంగంబులం
దీష ద్రేచకపూరకంబులను నెంతేఁ దోఁచు వృద్ధి క్షయా
ద్వేషం బైన రథాంగ మీతనువు నుద్వేగంబు గొంపొ వు నా
శోషన్ మార్చి సుషుమ్న లోవెలుతురున్ శోధింత్రు కుంభించుచున్. 500

ఉ. ప్రాణము లైదు చక్రచయ మాఱు శరీరకళాప్రపంచ వి
న్నాణములైన జాగ్రత మనస్సు స్వమాయను సంచరించు ని
ర్వాణసమాధి జీవజడభావములన్ విడిపించు నందు గీ
ర్వాణులు కీర్తి గీతములు పాడఁగ హంసను లేపు సిద్ధుఁడున్. 501

ఉ. చక్రము లాఱు రేపగటి చాలు శరీరరథంబు త్రిప్పు ని
ర్వక్రప్రథాన హంసయను పగ్గము లుంచి సహస్రపద్మ సం
ధిక్రమమైనసోహమ రతిన్ రవిగన్న వికాస మొందు నా
విక్రమమున్ సమాధిని పవిత్రతఁ గూర్చును యోగసిద్ధికిన్. 502

ఉ. ప్రాణము మూలబంధమునఁ బట్టి సహస్రముదాఁక నెట్టి యం
చానెడు వెల్గుచక్రముల నాఱిటి త్రిప్పినతుండలిన్ ద్వదా
ధీనము నాను నాఫణము త్రిప్పి యదల్చిన కంటిపాపలోఁ
గానఁగ నౌను జీవుని నిగారము నీశ్వరరూపభావమున్. 503

శా. ఆచక్రంబుల నాఱిటన్ దిరుగు నీహంసిన్ విరాజిల్లు త
ద్రోచిష్ణుత్వము నూర్ధ్వమై యెగసి దృగ్రూపంబుగా మాఱి యా
వాచాగోచరమైన జీవవిషయవ్రాతంబు బ్రహ్మంబుగాఁ
దోఁచున్ జీవసమాధిప్రాణములలోఁ దోలెంచి విశ్వాకృతిన్. 504

శా. వేదాంతార్థము భైషజంబును కళావిధ్వంసమార్గంబులో
దా వేమాత్రమ భౌతికం బిదియు నిర్వాణంబు స్వారాజ్యదృ
క్వాదం బియ్యది తార్కికంబులను ధిక్కారించు నీతత్త్వమం
దే దివ్యత్వము గల్గుచున్నది మహాంధీభూతరాహిత్యమై. 505

మ. హృదయాకాశమునన్ ఖగోళములు నెన్నెన్నో విడంబించు ద
ద్హృదయం బేమిటొ తోఁచ దీప్రకృతియం దేమో వితర్కించు త
త్పదమం దాహృదయంబు లేదు సురులోకాసిల్లు నీహంసలో
నుదయంబై యమృతత్త్వమిచ్చుహృదయోద్యోగంబునూహింపఁగన్. 506

ఉ. ఏరును దాఁటలేరు త్రిగుణేప్సితమైన జడత్వబుద్ధి వం
దారెడు మాయలోఁ దమసు దాఁటి పరాపరశక్తి శూన్యకా
సారతటంబునన్ దిరుగు సాధనచేత గ్రహించి దానిచే
ధారణచేసి హంస నవధారుము గాంతువు చక్రషట్కమున్. 507

ఉ. ధారణయందు హంస నొకతట్టున నిల్పి సమాధియందు నోం
కారము పాడు ప్రాణ లయకారము మాటున దాఁగియున్న నీ
వారు సువర్ణరూప మపహారములన్ విడువంగఁబోకు మా
దారి సమాధిజీవునిషిధంబు నెఱుంగుము నీశ్వరాకృతిన్. 508

ఉ. అరయ బ్రహ్మరంధ్రము సహస్రము గాదు శరీరకోశ మా
గారము ముక్తకంఠ నయగారము వీడినహంస యోగికా
కారము దాల్చిపోవు నధికారము వచ్చును దానియిక్క నీ
తీరు నెఱుంగ కీతనువు తెన్ను నరోధము సేయు టొప్పునే. 509

ఉ. ఈ యజపాజపక్రమము నేరు నెఱుంగరు దీనియందు పూ
జాయసమాకం బయిన చా లొాక టున్నది దీనియందు మై
రేయముకన్న మైకమగురీతి ఘటించెడు కుంభకంబులో
నాయువుపట్టు కుండలిసహస్రము నెట్టినవచ్చు చిత్కళల్. 510

ఉ. పాదము మూలమంట కుడిపాదము నేరుగనెత్తి హంస త్రై
పాదికమైన నాళ్ళను నుపాసన జేసి సుషుమ్న కుంభకా
సాదనచే మహోదరముపట్టి కలంచి తదేకదృష్టి హం
సోదయమా తెఱం గుదయమొందతితీక్షను జూతు వీశ్వరున్. 511

ఉ. ఆయువు చిన్న దందువ శతాధికవత్సర ముంతు త్రోవయీ
కాయము సిద్ధి కాఁగలుగు కల్పము హంస సుషుమ్నఁ బెట్టి మై
రేయము బోలు నాయమృతరీతి సహస్రము నందు లాగి హం
సీయుపథస్థజీవిత విసీర్ణతఁ బాయము సిద్ధి వచ్చెడున్. 512

ఉ. నాలుగునాళ్ళ బొమ్మువదనమ్మును జేర్పి నిరాశఁజెంది యే
జోలికిఁ బోక శాంతమతి ప్రొక్కుచు సోహము పాడి తేనియా
వాలున గుండె కొట్టుకొనఁజాలును దానినె చక్రషట్కమం
దోలీమరల్చగా నవి మహోన్నతి గన్పడు జీవగేహమున్. 513

— * నీవు * —

ఉ. ఆదిని నీవె యిప్పుడు నఁనాదిని నీవె చరాచరాత్మకా
పాదిత మైనసృష్టియు నిపాతనితాంతపదార్థరూపవి
ద్యాదయితాన్వితంబగు నజాండము నీవె నిజంబు నీనవో
న్మాద జడానుభూతి విడనాఁడుము బంధము నాసె దాయెడన్. 514

ఉ. నీవు నిజంబుగా హరిని యీశ్వరరూపుఁ డవవ్యయుండ వం
చీవు నెఱింగి యాయెఱుక నేప్రకృతిత్వము బాసి వేరుగా
భావనఁజేసి చూచునెడ వ్యక్తిగతంబుగ నీవు దోఁచునా
త్రోవయె తన్నుతా నెఱుఁగురూఢి యదే యమృతత్వమిచ్చెడున్. 515

ఉ. నీవును నీవుగా నెఱింగి నీ వయినట్టి తెఱుంగులోన నీ
దేవునిఁ జూచి యాది విని తేజముతోడను మేళవించి నీ
భావము మార్చి లోకపరిభావిత దివ్యపదంబునందు నీ.
స్థావర మున్న దన్న పదసందున నిన్ గను మచ్చటచ్చటన్. 516

శా. నీయైశ్వర్యము నీమహావిభవమున్ నీవెంటరానేర దీ
మాయన్ వీడి మరెందు బోయెదవు నీమార్గంబు నూర్ధ్వాపర
ప్రాయంబైనది నిమ్న లోకనిచయావాసంబుగా నున్నదా
యాయూ సెవ్వరుఁ జెప్పలేరు మఱి నీయర్థంబువ్యర్థం బగున్. 517

ఉ. ఎందుకు నీవు పుట్టితివి యేమిగడించితి వింకమీఁద నీ
వెందుకు నుండఁజూచెద వదే మృతి కోరలు విప్పియున్న దో
మందుఁడహోయిగాఁబ్రతుకుమార్గము చూఁడుము చూడు సృష్టిసౌ
యందమునందు లీనమయి యాత్మ నెఱింగి మృతిన్ జయించుమా. 518

ఉ. ఇచ్చట నీ వవేపగిది యీశ్వరరూపరహస్య మందు సం
పచ్చయ మైన నీమనసు వాసి యభేదరసానుభూతికా
వచ్చు స్వతంత్రభావమున బాహ్యము లైనవెలుంగులందు నీ
వచ్చుపడన్ మెలంగెదు త్వదాత్మయదేయమృతత్వ మొందెడున్. 519

శా. ఎన్నోమాఱులు పుట్టి చచ్చి చెడి యెన్నెన్నో ప్రపంచంబులన్
ఛిన్నత్వంబు విచారమున్ గడిపి యీక్లిష్టైకజన్మంబులో
భిన్నంబై పరివర్తనాటకకళాభిజ్ఞానసంపత్తిలో
నున్నా వీవు నిజంబుగాఁ దెలివి నికున్నన్ వృథాపుత్తువే. 520

ఉ. ఆసనముల్ మహామహిత మైన తపస్సులు సాధనంబులన్
గాసిలనేలనీనిజము గాంచిన నీయెద నీశ్వరుం డదే
వాసము చేయు నీమఱుఁగు వాసిన మోక్షము లేదు సద్గురో
ద్వాసము జేసి నీమనసు పగ్గము లాగెడు కీలెఱుంగుమీ. 521

ఉ. చెప్పుము నీస్వతంత్రతను జీవితమందు రహస్య మంత్రమున్
జెప్పుము జెప్ప రానివియు చెప్పుము చేతనరూపకంబు లై
తప్పులుజేయు జీవతతి తత్త్వ మెఱుంగనివారు తప్పులన్
గప్పఁ బ్రయత్నముల్ సలుపు గాని మహాత్ములుచాయ రెప్పుడున్. 522

చ. ఎవరికి వారు వ్యక్తిపద మేర్పడ నేవా స్వతంత్రభావముల్
దవిలి రసానుభూతి నమృతత్వము శాశ్వతమైన పేరు నీ
భువినిఁడునట్లుఁగా దివికిఁ బోయినలోపము మార్చ రేని త
త్త్వవిమల జీవితావధి వృథాయగు మందత చెల్ల దెప్పుడున్. 523

ఉ. చెప్పుము నీకుఁదోచినది చేసిన చేయకపోయినన్ నిజం
చెప్పుడు మిన్నుకొట్టుకొని యేగుము మాయతమిన్ మనస్సు పైఁ
గప్పిన మేల్ముసుంగులు తెగన్ చెగఁబార్చు మృణాళి కన్నులన్
విప్పక మూసుకొన్న రవి విప్పిన కైవడి విచ్చు నీఁకటల్. 524

చ. నిజముల యీశ్వరున్ గనిన నిర్గమనంబులు నున్న వెవ్వ డీ
గజిబిజి వీడెదో యపుడెఁ గల్గు వెలుంగు విలాసభాసురో
ద్విజితమనోవికాస మది విహ్వలకాంతి యభౌతికంబు భూ
రజముగనో నగంబుగనో రాజిలిముక్తినిఁ గాంచఁగావలెన్. 525

చ. ప్రతియణువందు నీశ్వరుని ప్రత్యగభిన్న నిజాత్మతత్త్వ మా
గతిఁ గనుపించుచుండ గుడిఁ గట్టి ప్రపత్తిని మృత్తికాశిలా
ప్రతిమల నేలఁ గొల్చెదవు బాహ్యములైన నిమిత్తముల్ మనో
గతములు చేసికొమ్ము తనకన్నను దేవుఁడు లేఁడు వెచ్చెలీ. 526

ఉ. చేయుము చేయఁగల్గినవి చేసినవెల్ల ఫలంబుగాంచఁగా
పోయిన పోవనిమ్ము విధి పోయినరీతిని పోవుకర్మయే
దో యని వార్యకార్యకల నోజ్జ్వలమై పరువెత్తు నీ నికిన్
బ్రాయికమైన శాంతియుతపాకము లేదు సహించు మన్నిటన్. 527

శా. ఏకాంతంబును నిశ్చలత్వమును సంతృప్తిన్ విడంబించు న
ట్లే కొద్దోడినమందు నేర్పడఁగ నెంతేఁ జూచి యాలోన నా
లోకింపందగు యోగమార్గము నిధిధ్యాసాప్త చిత్తంబుతో
నాకాశంబును నాకమున్ సుధయు నధ్యాత్మంబు రూపింపఁగన్. 528

ఉ. ఔనని కాదటంచు పరిహానకమైన పదంబునందు నీ
మానస ముంచఁబోకు నొకమాటనె గట్టిగ విశ్వసించి నీ
వైన తెలంగు నీశ్వరునియందు లయంబొనరించి తత్పర
ధ్యాననిపీయజ్ఞానరసం దమృతత్త్వము సేకరించుమీ. 529

శా. ఎన్నోమాఱులు పుట్టి చచ్చి చెడియె న్నెన్నోవిచిత్రంబులం
దున్నానంచు నెఱుంగు దీవు మఱి యీయుర్విన్ విసర్జింపితే
నెన్నా ళ్లైనొ ప్రభాతభాసుర మహాస్వేచ్ఛావిహారక్రియా
చ్ఛన్నంబైన మనుష్యజన్మ మిపుడే సార్థక్యము౯ సేయుమా. 530

శా. ఏదోపద్ధతి నాశ్రయించి యది యెంతే నిక్కమం చూరకే
వాదింపం జనకేంద్రియంబులను జీవత్వంబు దేహంబు నా
పాదింపందఁగు నీమహాప్రకృతిసంబధంబు పోనాఁడు ది
వ్యాదర్శంబు ఫలాప్తి నొంది యమృతత్వంబంద నూహించుమా. 531

చ. తెలిసినవారు నేర్చి తన తెల్విని నీశ్వరునందుఁ జేర్చి సొం
పలరఁగ మెట్లనెక్కి తనయం దమృతంబును షస్సుస్వర్గమున్
వెలుతురుఁ గాంచినారు చెడి వెంగలికైవడి మీనమేషముల్
జలచరభూచరంబులను సాటువులాఁడుచు పోయె దేటికిన్. 532

ఉ. మానవుఁ డెప్డు పూర్ణుఁ డనుమాట నిజం బని దమ్మఁబోకుమా
మానవదృక్పథంబు జడమార్గము నీశ్వరునందుఁ జేర్చి వి
జ్ఞానసమాధిలో తెలివిఁగన్న తపస్వి కృతార్థుఁ డామహా
స్థానరహస్య మీవనెఁడు తాళములోఁగల దర్థపేటికన్. 533

ఉ. నమ్మకు నేరి నెల్లరను నమ్ము నిజమ్మన నచ్చె నేని వ్య
ర్థమ్ముపవిత్రజీవితము గ్రాలనివారల పేర్మివమ్ము లో
కమ్ము స్వలాభమందెనయు గావునఁ జెట్లుమృగాలతోడ స్నే
హమ్ము గడించి డించి "ఫరహాదు"ని కైవడి బుచ్చకాలన్. 534

చ. ఇదియొక నాటకంబు స్రజ లీతెర స్వీయచరిత్ర, బాడుమన్
తుద మొదలేమొ నేరక నధోగతిపాలయిపోవుచుంటిరే
సదనము బాసివచ్చిరొ ప్రశాంతమతిన్ దలపోయరా మహా
పద మిదె యిందె నిల్చెదవు స్వర్గము మోక్షము వేరయున్నవే. 535

చ. బ్రతుకు దినాలు నిద్రల నెపంబుల బాధల శోకమోహసం
గతముల రిత్తపుచ్చెదవు కాలము కావలెనన్న వచ్చు నే
మతిని మరల్చి మోద మనుమార్గము దృక్పథమందు బెట్టి త
ద్గతిని త్వదీయమర్మము గాంచుము నీశ్వరుఁ డంచునెంచుచున్. 536

ఉ. కాగితముల్ కలంబులును కాదన కెన్నొతపాలుఁజేసి ది
వ్యాగమముల్ లిఖించినవి యాగతి నీవు తపంబుఁ జేసి వి
ద్యాగమనంబుచేతఁ బడయం దగు నీ వను బ్రహ్మతత్త్వసం
యోగము ముక్తి యెల్లరకు నొక్కటె సృష్టిజడత్వ మారెనన్. 537

చ. విధియు నిషేధముల్ త్రిగుణవిహ్వలమైన ప్రపంచవాంఛలం
దధిగమనంబులై వెలయు నందు నిజం బగుశాంతి లేదు నీ
పథమున నీశ్వరప్రకృతిపద్ధతులన్ విడదీసి తేని నీ
కధికము నీవ మన్న దొకటైన గనంబడ దేది కాంచినన్. 538

ఉ. వట్టివి కల్లవొల్లులు ప్రపంచక వాఙ్మయమందు పేరులన్
బెట్టి రచించినా రవి వివేకమతిన్ విడనాడి నీవు నీ
యట్టి యథార్థరూపమును నాత్మగనిల్పి స్వరూపనిర్వృతిన్
గట్టి చలింప కెట్టెదుటఁ గాంచుము నీయపవర్గతేజమున్. 539

ఉ. ఏమిటి మాయ లేని దది యేమిటి యేటికి యుక్తివాద మ
వ్యోమహిమాస్పదంబయిన యోగము నీవనుజీవవస్తువున్
ధీమహితుండవై పడసి దివ్యపదంబున శూన్య మన్న దే
యేమియులే దటంచు నిదమిద్ధ మటంచును గాంచు మీశ్వరున్. 540

ఉ. ముక్కలు కాద నాత్మ యని మోదుకొనన్ బనిలేదు నీవు నీ
చక్కి తపస్సమాధిని విచారణఁ జేసి రసాత్మకంబునౌ
ఫక్కి స్వతంత్రమైన దది స్వర్గముఁ గాంచును లేనిదేమొ పెన్
జిక్కుల రౌరవంబులకుఁ జేరును దీనికి వాద మేటికిన్. 541

ఉ. గాఢలు కట్టివేసి తనకంటె పరోక్షము నైనవస్తు వే
బోధలనైనఁగాని వినఁబోకుము సర్వము నీవుగాఁగ సం
బోధనఁ జేసి యాతెలివి ముందు వెలింగెఁడు వెల్గులోన నీ
సాధనపూర్తిచేసిన నసాధ్యము నిన్ గబళింప దేదియున్. 542

తే. పాట పాఁడుచునుంటివా పరులు వినఁగ
నీకు నీవేల పాఁడి ధ్యానించవోయి
ఎవరిపాట వారికి వినిపించ లేదు
పాట తనజీవచరితనేపాడుచుండు. 543

మ. గుడిలో లింగము జంగరూపమున నీకున్ దోచు వెన్నాఁడి ద్రు
క్కుడి పాషాణముఁ గాఁగఁ జూచు విచలకారంబు విభ్రాంతులన్
బడశంఖంబును వేణునాదకలనన్ వర్ణించ నీగుండె వె
ల్వడనిస్పాణముఁజేసి చాటునిజమున్ బ్రహ్మాండముల్ మ్రోయఁగన్. 544

ఉ. నెత్తిని బాదుకొన్నటుల నే నిర్ఝరినేల తరంగమాలికన్
మొత్తును సైకతాన నొకహెంతను గళ్లుగ దీర్చు వానిలో
నుత్తమముల్ ప్రభాతముల నోర త్రికాలముఁ జెప్పు నందు నీ
చిత్తము ప్రస్తరించునెడ సిద్ధుఁడ వయ్యెద వాత్మశుద్ధిగన్. 545

ఉ. ఏపనినైనఁ జేయు మది యెప్పటికైనను పైకివచ్చినన్
బాపముఁ జెందరాదు పరవంచనయందు స్వశక్తి జీవితా
రూపము మాసిపోవు నవరూపమహత్తర యోగమార్గ మి
ధ్యాపరతంత్రమైన స్వపదంబు జితేంద్రియ మైనదారయన్. 546

ఉ. జాగ్రతయందు స్వప్నమును జాగ్రతయందు సుషుప్తి యున్న నీ
యుగ్రతనూవికారవిభవోజ్జ్వలమైన స్వశక్తి యీశ్వరా
నుగ్రహమైన నీతెలివి నూల్కొనఁబట్టి సమాధి చూచినన్
నిగ్రహమై శరీరమున నిద్ర జనించును గాంతు వీశ్వరున్. 547

ఉ. దేవుని జూచుటన్నదొక దీక్ష మహామహనీయమైన వి
ద్యావిభవంబుగాదు తనుతాను గనుంగొని తానెయైన యీ
తావున దేవునిన్ నిలిపి తత్త్వపథంబున సోహనాద సం
భావిత తేజమున్ బడసి బంధము వాయుట గొప్పమాటగున్. 548

చ. బయలను నీతెరన్ దెరప వచ్చిన శూన్యములోన సత్పదా
ర్థయుత మహామహత్తరతరంబగు వెల్గు రసాత్మకంబునై
నయనములందు దోచును ననాహతమంటెదు జీవశక్తి నా
రయనగు లక్ష్యలక్షణపరంబగు నీశ్వర రాజ్య మాయెడన్. 549

శా. ఈ జన్మంబున రానిజ్ఞానము మఱేదేజన్మలో వచ్చునం
చే జాడన్ వచియింప నేర్తురది యెంతే నిక్కమోకాదొ మి
థ్యాజాలంబులఁ జిక్కినూహలనిధి ధ్యాసంబు వర్జింతు రే
తేజో రాజితమైన యీ బ్రతుకులో దివ్యత్వమార్జింపుఁడీ. 550

ఉ. ఆకసమట్టులీశ్వరుఁడు నాత్మయఖండమున ద్వితీయమై
లోకము వర్వెనన్న నిజలోపము దేనివొ చెప్పఁబోరు మూఁ
డేకముజేసితే యొకటికేనియు స్థానముచేసి ముక్తి యం
కేకరణిన్ లభింప నిటులేటికి యుక్తులు పన్నుచుందురో. 551

ఉ. కొందఱు పంచభూతముల కొంపశరీరము పాంచభౌతిక
స్పందితమైనశించునని బల్కుదురయ్యదెశూన్యవాద మా
చందము నిక్కమైనఁ దన సాధనచేత మనస్సు నీరుగా
నందుత్వవాత్మ యీశ్వరుని యాకృతి వాల్చును శాశ్వతాప్తికై. 552

ఉ. కారణ మొక్కటిన్ మఱియు కార్యము నొక్కటిగాదు కారణ
స్ఫారగుణత్రయైకసదసత్ ప్రతిపాదక నామరూప వి
స్తారధరాప్రపంచక పదార్థము లీశ్వరజీవ వస్తువుల్
వేరులుగావు తత్త్వకృతి విభ్రతి వేరయి తోఁచుచుండినన్. 553

ఉ. సత్తుసువిత్తు మోదసహజంబులు నాత్మకుఁ గల్గనేని యా
పత్తుఘటించు ద్రవ్యములు ఫక్కిగుణాత్మకమైనదన్న నా
నెత్తము శూన్యవాదమున నించు నిజప్రతిపాద తత్త్వమా
యెత్తునఁ బోవుచున్న దిఁక యేమిటి ముక్తిమనుష్య కోటికిన్. 554

ఉ. భాసురమైన నర్థపరి భాషిత దివ్యపథంబులందు వి
శ్వాసము బెట్టి యీశ్వరుని సంగతి చెప్పుటకంటె నాకశా
భ్యాసముచేత నాతని గృహంబును నాతని రూపుజూపి మా
యాసము పాసితంబున నాశను నాశముజేయు టొప్పదే. 555

ఉ. ఊహకుఁ దోఁచితోఁచగనె యుష్షునఁ జెప్పెడి వెల్లనిక్కమై
రాహువునైన నెట్టఁదన రారుజయధ్వజమెత్తునట్లుగా
సూహసమర్దనీయమగునో యది కాదను భావమందు సం
దేహమువచ్చు నాజడమతిన్ మఱి చెప్పగఁ లేరు జ్యోస్యమున్. 556

ఉ. రేలుబవళ్లు సంధ్యలు సురింబలె చుట్టి పదార్థవంపనో
ద్వేలము కావలన్ బరచి విహ్వలరూపము జూపుచున్న నీ
కాలము భక్తకోటి లయకాలము వ్యాళములీలబోలు వే
లీలల బాధవెట్టు నవలీల నెఱింగి కలంగ కేయెడన్. 557

ఉ. అన్నిమతంబులున్ సమములంచు వచించుట పాడిగాదు నం
దున్న నిజాలఁబట్టి పలుత్రోవలు బోవుదురందు నీశ్వరా
భిన్నని జాత్మతత్త్వపరి విశ్రుత దివ్యపదావలంబ సం
పన్నత హేమవిద్యవలె వచ్చును దానికిఁ బోలవేవియున్. 558

ఉ. నేరచియంచెదన్నవి యనేకములైనవి కావ్యపంక్తులా
భారము యౌగింకంబయిన వాఙ్మయమంతయు నాగంబు లీ
తీరున పౌరుషేయములు దీర్ఘతగాంచెను నీరహస్యముల్
నేరిచి నీవుకాదనుచు నీయనుభూతము వ్రాయుమన్నిటన్. 559

సీ. అక్షరసాంకేతి కైకమా విద్యల
నెల్లవారును నభ్యసింప గలరు
అవికృతకంబులు నధ్యాత్మ విదులైన
సాధకునకు ప్రపంచకమె చదువు
మేఘాల రేఖలు మెఱపుల చలనంబు
కడలిని సింగారుసుడులు విసుక
నేల గాలికిఁ గాలు బాబును సెలయేళ్ల
వాలును నిజమైన వ్రాతలనఁగ

గీ. వాని చదువుఁడు జగము మీతోను మాట
లాడుచున్నదిగాఁ బ్రమోదాప్తివచ్చు
యోగికంబగు సిద్ధిలో నున్న తెఱవు
కవియె విశ్వంబు విశ్వంబు కవి నిజంబు. 560

ఉ. చేసెడు కర్మలందు తన చేతను కానివికూడవేళకున్
జేసెఁడు శక్తివచ్చునది చేసెఁడు వాఁడు మఱొక్కఁడన్న వి
శ్వాసమె యీశ్వరుండు పదిసత్ ప్రతిపాదక బ్రహ్మతత్త్వసం
వాసిత వాసనాస్ఫురి వర్తనమే నడిపించు లోకమున్. 561

ఉ. ఒక్కఁడు పూజసేయుమఱి యొక్కఁడు ప్రార్థన సేయుకావలో
నొక్కఁడు ముక్కుమూసుకొని యుండును వీరల కేమి మోక్షముల్
జిక్కునొ మానునో తపసి సిద్ధివహింపఁగ దీక్షజేసి కై
పెక్కిన వాని చందముజితేంద్రియఁ డై కనఁ జెల్లునీశ్వరున్. 562

ఉ. కోకిల కంఠమె కీ యన కుంఠితగా నరసాప్తిచే రసా
లోకనమైన దివ్య పదలుప్తులసైతము మెచ్చచేయునా
నాతలుషాపహంబయి యనంత రసాస్పదమైన ప్రేమగా
నాకలనంబు నీశ్వరు నవంతునిబాడిన మెచ్చసేయదే. 563

ఉ. భక్తుఁడు నీశ్వరుండు విను పాటలుపాడు మనస్సులోన నా
సక్తిని వాని నీశ్వరుఁడు సంతస మొందుచునుండు దానిలో
ముక్తియు శాంతియున్నదది ముఖ్యము పాటలుపాడి భిక్షమున్
భుక్తిగడించువారలకుఁ బోలదు నీమహనీయగానమున్. 564

శా. కల్లుంద్రావిన కామినీవ్రజముతోఁ గల్లోలినిన్ గ్రీడ రా
జిల్లన్ జేసినఁ బాటపాడిన తపస్సిద్ధిన్ బ్రదీపించు వా
రెల్లన్ సిద్ధులటంచు చెప్పెద రిసీ యూహాప్రపంచంబు సం
ధిల్లన్ భౌతికమాత్మయౌ నెడల మృద్విధుల్ కదాధర్మమున్. 565

ఉ. ఈజగ మొక్కలెక్కయె యిదేనిమషానకొ మాఱిపోవు నీ
యోజననీతు లన్నవి మహోన్నతనైతికమార్గ మంచు మా
యోజనలందు దోఁచును విషోరగబద్ధస్వరాజ్యకాలు షీ
భ్రాజిత భ్రాంతి జీవసుధభాండము నేలను మోదవచ్చునే! 566

శా. కల్లుం ద్రావిన మాంస మమ్మిన మహాకాలుష్యముల్ చేసి రా
జిల్లన్ వేశ్యలఁ బోలు భార్యల వచఃశృంగార రాద్ధాంతముల్
జెల్లన్ డబ్బును రాజ్యగర్వము నదే జీవంబుగా నెంచు నీ
యుల్లాసంబు విషప్రవృష్టివెత నుద్యోగించు నానాటికిన్. 567

శా. కాంతా కాంచనకామషట్కములు విక్రాంతిన్ విడంబించు వి
భ్రాంతిన్ జెందినమానవుండు నిజధర్మంబుల్ కులాచారముల్
శాంతిన్ బాసి విచారసాగరనటత్ ఝుంఝానిలావర్త వి
ధ్వాంతాధిష్ఠితనౌకఁ బోలె దిరుగున్ వ్యర్థప్రలాపాంబుధిన్. 568

ఉ. ఏది నిజంబుగా నిలిచి యిద్ధసుఖై కరసానుభూతికిన్
రాదు వచింపరాదు విధిరాయిడి కోఁడి జగంబు బద్ధమై
యేదోవిధానఁ బోవు మఱి యేటికి దీనివిచార మాగళత్
పాదప మట్లు రాగములఁ బాసి స్వతంత్రత నిల్పుఁజూడుమా. 569

సీ. మానవుం డొక యస్థిపంజరబద్ధుండు
కామాదివిషయవర్గముల నెలవు
మేఘాల మెఱుపులు మెలఁగెడుచందాన
దీనిలో తేజంబు దేజరిల్లు
అమనస్త్సత్త్వ మహాశక్తి విశ్వంబు
కంపింపసేయు విజ్ఞానగరిమ
జ్ఞానసాధనజీవజడములఁ బరిమార్చి
విశ్వకవాటంబు విప్పివేయు

తే. గీ. అప్పుడీ వెవ్వరైనది యరయఁగలవు
జ్ఞానతత్త్వంబు పాఠాలుగాఁగ నేర్చి
యోగతిని జయభేరి వాయింపవయ్య
ప్రజలహృదయాలు నీరయి పాఱునట్లు. 570

ఉ. కాన ననేకవృక్షములు కాయుచుఁ బూయుచు నెండిపోవు నీ
మానవు లట్లుపోయి ఋజుమార్గములే మఱరాదు లోకవి
జ్ఞానముగల్గియుంటినను చాలదు నిక్కము బ్రహ్మవిద్య జ
న్మానకు నేర్చుకోవలయు నవ్యకళాసము పార్జనార్థమై. 571

క. కీకాటవిలో ద్రోణుని
యాకారము నేకలవ్యుఁ డనువాఁ డిడి సు
శ్లోకమతిన్ విలువిద్య ల
నేకము నేర్చె ననె భక్తి నెఱిగించు నెడన్. 572

ఉ. ఎప్పటికైన జ్ఞాన మభివృద్ధినిఁజెందిన సద్గుణంబులున్
గుప్పలు తిప్పలై పెఱిగి కోవిదులన్ బొనరించెనేని సొం
పొప్పఁగ విశ్వరూపములనుండి గ్రహింతురు నిష్టసిద్ధు లీ
గొప్ప సుమీ స్వరాజ్యములకున్ దలఁదన్నెడు సయ్యమీత్వమున్. 573

సీ. మాయలోపల మహామహిమను దర్శించి
శూన్యంబులో జ్యోతి చూడవలయు
పురంబులో నాత్మతేజంబు గాంచి యా
నెలసుబోపలహరి నెఱుఁగవరయు
దేహంబులోకీలు తెలిసియు మనసును
వంచి సుషుమ్న శోధింపవలయు
ఊర్ధ్వదృష్టిని పెట్టి యూహించి యా నిరా
కారంబులో నిన్నుఁ గాంచవలయు

తే. గీ. మోసపడి హొత్తములపొంతఁ బోవవలదు
తెలియక జ్ఞానగాథలఁద్రెళ్లవలదు
అసలుమర్మంబు మనసులో నరయవలయు
నీవు నీవైనపోటులో నిలువవలయు. 574

ఉ. జ్ఞానమునందు మానసికసంగతు లున్నవి బ్రహ్మతత్త్వ వి
జ్ఞానము నేర్చితేనిత్రిజగంబులు నొయ్యన నూపివేయు వి
ద్యానిరవద్యశక్తిగల దందలి నీనిజరూపునందు నే
దో నలుపున్న దామసిని ద్రోలిన నీశ్వరుఁ డీవు నొక్కటే. 575

ఉ. జ్ఞానమహాఫలార్థము నిజప్రతిపాదక యోగసిద్ధ వి
ద్యానవసాధనోద్యమవిధానము నేర్వఁ దలంచినట్టి వి
జ్ఞానులు కామముఖ్యరిపుషట్కము నిర్దళితంబుజేసి తా
నైన యథార్థ మందలమనంబులయం బొనరింపఁ గాఁదగున్. 576

చ. అది హృదయానుషంగమగునట్టి యదార్థము దృష్టిగోచరా
స్పదములు దానినుండి వెలువడ్డవి మిథ్యనుబోలి మాయలో
మొదలు పునాదిపెట్టి తనముందర మోహనరూపవై ఖరెస్
గదలుచు జీవసోజ్ఞ హొడఁగాంచెడువ్యక్తి యదే యెఱింగినన్. 577

సీ. అపవర్గమార్గ దివ్యాదర్శమైన వి
జ్ఞానసోపానంబుఁ గట్టవలయు
యోగవిద్యాసాధనాగారమున మాయ
తెరయెత్తి యీశ్వరు నరయవలయు
ఆత్మజిజ్ఞాసవిన్యాసభాసురకాంతి
శూన్యంబులో దివి చూడవలయు
ఏకాగ్రతసుషుమ్న నెనసినతెరవులో
సోహనాదాప్తిని స్రుక్కవలయు

తే. గీ. జీవభావైతన్యమును మార్చి చిత్త మేర్చి
దృక్కునార్చి నాహోజ్యోతి తేటుగూర్చి
చీఁకటి వెలార్చి జగము నిర్జించవలయు
జ్ఞానసిద్ధుఁడు లోకవిఖ్యాతుఁ డగుచు. 578

ఉ. జీవితమందు నొక్కొకరు చిత్రవిచిత్ర వివేకతత్త్వపుం
ద్రోవలుదీసి తేజ మను తోయధిలోపల తేలిపోవు మీ
నావల నీశ్వరుండను ఘనస్థలికిన్ నడిపించి చేరలన్
ద్రావుఁడు నిండుప్రేమను సుధారసధారలొ వాకి పూరమో ! 579

తే. గీ. కర్మవాంఛలఁ జెడక నిష్కామకర్మ
ధర్మనిరతిని జ్ఞానసాధనము జేసి
యీశ్వరుని జ్ఞాని నాత్మ దర్శింపవలయు
తన యభివ్యక్తిగాఁ బ్రతియణువునందు. 580

ఉ. ఏదియు నిల్వలేదు తుద కీగతి మచ్చలువడ్డమానసం
బేదరిలేనిదుఃఖముల నీశ్వరు గాంచి తరించుసూహలన్
వేదన లొంది చుక్కెదురు వీడనిరాగి యుషస్సు లశ్రుచా
రాదయితంబులై పిలుచురాత్రులయందు లయంబు నొందఁగన్. 581

ఉ. ఇంతులకున్ దరిద్రులకు నీశ్వరుఁడన్న మతంబు లన్న వే
దాంతము లన్న నెంతొ ముద మంచు హసింతురు భావతాత్వికుల్
తంతుల సాలిపట్టువలె దాటగ లేరు దురాశ దుఃఖదు
ర్ధ్వాంతభవాంబు రాశి నిఁక పంచన యేటికి విచ్చిపోవఁగన్. 582

## — ♦ తపస్సు ♦ —

శా. ఏదో గొప్పయదార్థ మీతపసులో నీజ్ఞానమార్గంబులో
భేదం బొందకనున్న దీనిజమవిచ్ఛిన్నో క్తినూహింప ది
వ్యాదర్శంబయి జీవరూపమున నధ్యాత్మైకత త్త్వంబుగాఁ
బ్రాదుర్భావము నొందునయ్యది తమిన్ బోగొట్టు బ్రహ్మాకృతిన్. 583

మ. షవదీయం బగు ప్రార్థనార్థములు నీవాదంబు లాయీశ్వరుం
డవినాశిన్ బరిహాస పెట్టెడు దయాధ్యాహారముల్ నేర్పఁబో
వు విధానన్ దలపించు నాతఁడు వృథాపూజా ప్రసాదాళికిన్
జివుకన్ బోడు త్వదీయబై క్షుక జపచ్ఛిత్రాతుల్ వీడుమా. 584

వ. మున్నల మదిన్ కబీరగ్నిం బ్రవేశించె ననిన

సీ. ఏశ క్తియాయగ్ని యిసుమంతయేనియు
కాల్చకుండఁగ నార్పఁ గలిగె నొక్కొ;
ఏశ క్తియగ్ని ప్రవేశించుటకు ధైర్య
సాహసంబులు నేర్పఁజాలె నొక్కొ;
ఏశ క్తి యగ్ని నొక్కింతసోకఁగనీక
కవచంబుకై వడి గడఁగె నొక్కొ;
ఏశ క్తి యగ్నిమాయించి శాంతిని నించి
శాదంబినులఁబోలెఁ గ్రాలెనొక్కొ;

తే. గీ. అదె తపచ్ఛక్తిము "న్నబ్రహాము" వంటి
పూజ్యు లవతారులకును వాఃపూర మయ్యె
నని మదీన్ కబీరార్షి ప్రత్యక్షపరచె
జ్ఞానసాధకునకును విశ్వంబె వెరచు. 585

ఉ. ఏచదు వెంతవచ్చునొ యదే గతి నూతనవిద్యకూడ నెం
తేచదివింపవచ్చు నది యీశ్వరుఁ జూచినకండ్లతో నెదేఁ
జూచిన విశ్వరూప మట శోభిలుచుండు తదీయరాశి వి
ద్యాచయ మెంతకావలెనొ యంత గ్రహింపగవచ్చు జ్ఞానికిన్. 586

మ. ఒకమారీ నిఖిలప్రపంచచయ సంఘో ద్దేశవారాశులన్
జకితాఖిలవివాదవీచికలచే సంక్షోభమున్ బెట్టి యే
ది కళామందిర మేది యీశ్వరునకున్ దిక్సూచికం బేది యే
ది కనత్ కాంచనమోక్షధామ మని శోధింపగఁ గర్జంబగున్. 587

ఉ. మాటలుఁ జెప్పలేని పరమాణువులన్ విడదీసి వానిలో
మాటయియున్న వెల్గనుకవాటము విప్ప సుషుమ్న దోఁచు నా
చోటప్రశాంతరాగరసశోభితదివ్యవిలాసవైఖరిన్
బాటలుబాడు చక్రిప్రణవంబయి కన్పడు విశ్వరూపమున్. 588

ఉ. చేతులు చాచి వ్రేళ్ళపయి చిన్మయదృష్టిని నిల్పెనేని నీ
చేతనమందు గల్గు నిజజీవకళాకలితార్థతత్త్వ వి
జ్ఞాతము కొల్వనేర్తు వదె సాధనమా నిరవద్యమైన వి
ద్యాతతియే తపస్సు నమృతాకృతి నీవు తరెంతు వన్నిటన్. 589

శా. ఆహా! శూన్యము దీని నొక్కప్రియురాలై నట్లుగానెంచి నీ
యూహన్ బెక్కువిలాసవైఖరులతో నూరించుచున్నాఁడవీ
మోహం బెంతవిషాదపెట్టఁగలదో ముందేమి కానున్నదో
యీహామాధ్వముద్రావిమత్త మతివై యీనేలనిద్రించుచున్. 590

## — ♦ కలికావతారము ♦ —

చ. కలిహరణంబు జ్ఞానకఁ గల్కియొనుర్చును గాన దీనికే
యిల "మహదీ" యటంచు వచియించె మహమ్మదువారుగాన భ
క్తులు కలికావతారమిషతో నొకవ్యక్తిజనించు భ్రాంతిమై
పలుకఁగఁజెల్లదీశ్వరుఁడు వచ్చుచు పోవుచునుండ డెప్పుడున్. 591

తే. గీ. చెదలు ముదిరినఁజెక్కలు నొదపుచుండు
వెట్టుముదిరిన బదనిక పుట్టుచుండు
కాలమీరీతి ముదిరిన కలిజనించు
కలిని హరియించువాఁడెపో కల్కిమూర్తి. 592

సీ. ఈసచరాచర మీసృష్టి దారుణ
జ్వాలలఁబడి మాడి సమసిపోవు
మానవలోకంబు మహి శూన్యమైపోయి
విజ్ఞాన సత్కళల్ విలయమొందు
ఆవేన్క జనియించునట్టి వారలు జడ
ప్రాయులై యుగముల మసలఁగలరు
ఏనాఁటికో కళాజ్ఞానంబు నుదయించు
నాఁడును గలుగు వినాశనంబు

గీ. ఇట్టులగచాటు లోకానఁబుట్టకుండ
శాంతి స్థాపించు యిహపరసాధకంబు
నైనతత్త్వంబు నాదర్శమట్టు జేసి
ధరణి పాలించు కలికావతార మరయ. 593

ఉ. ఆతనికిన్ బ్రపంచచయమంతయు జిక్కు మహామతాంతర
వ్రాతము నొక్కటై యెఱఁగు పాడయిపోయినధర్మమార్గ సం
జాతము సంస్కరింపఁబడు జాల్మడునొకలికూలిపోవు నీ
భాతిదురంత దుఃఖములుపోవును భక్తులకెల్ల మేలగున్. 594

ఉ. ఆకలికావతార సముదంచిత జ్ఞానబలంబు దుష్టమా
యాకలి ద్రుంచి లోకము మహత్తరశాంతి ఘటించునట్లువి
ద్యాకలితప్రభాపటలమైన తపస్సును సాగునట్లు తా
నై కదలించు తాత్త్వికమునైన చలంబు జగంబుప్రాన్పడన్. 595

ఉ. ఆరణరంగమందు సచరాచరమైన యజాండబాండముల్
దారుణవీతిహోత్రమున దగ్ధముజెంది నశించిపోవు దు
ర్వారదురంతదుర్భరపరంపర లంతట నావరించు తత్
ఘోరలయంబు నాపి తనతో నడిపించును కల్కి ధర్మమున్. 596

ఉ. కావున భక్తి మార్గమును గాంచిన జ్ఞానసభాప్రదీప్తసం
భావితధర్మమార్గమె ప్రపంచికమున్ నడిపించు లోకపుం
గోవెలలున్ విరాట్టులును గూలినశించగ నీశ్వరార్ద వి
ద్యావిధమున్ మనోబరముదారమహత్మ్యము గల్గునట్లుగన్. 597

ఉ. ఆకలికావతారకథనారసి యాఖిలలీగురుండు న
స్తోక మనీషవ్రాసె సురుదూపరిభాషను "నిల్మెసైర"నం
గాకథకల్కి భాగవతమంచువచించెఁ దెలుంగునందు నా
నాకలుషావహంబయిన నవ్యమహోమహిమార్థతత్త్వమున్. 598

ఉ. ఆనియమంబులన్ దవిలియాపథమందె కహేనెషావలీ
జ్ఞానసభాప్రపంచమును సాధనచే నడిపించె నావలన్
లూని తమస్సు భాస్కరునిఁబోలెవెలార్చి మొహీయదీను బా
ద్షానడిపించెజానసభధన్యముగాగ ననంతకాలమున్. 599

సీ. మాపితామహుఁడు తన్మర్యాదపాటించి
బోధించె శిష్యసమ్ముఖమునందు
మాతండ్రి యిది లోకవాంఛాప్రశక్తిని
గలిగించునని నేర్పె జ్ఞానవిద్య

విద్యా ప్రచారంబు విశ్వమానవలోక
మోక్షించు తెలి వెలిఁగించి తేను
కలికావతారంబు కథలును మహదీమ
హాత్మ్యంబులును జెప్పరై తి రనుచు

గీ. కొంద రడుగుచునుందు రానందముగను
నేను వచ్చితిదేదా రానిండటంచు
చెప్పుచున్నాఁడ యోగముల్ చెప్పునపుడు
బయలుపడుచుండు కాలగర్భమునఁగలవి. 600

శా. అధర్మంబు పవిత్రమైయమలమై యాదర్శమైయొప్పథా
త్రీధామంబు ప్రవేశపెట్టి విజయోద్దీప్తి న్ విడంబింపఁగా
సాధుల్ భక్తులజ్ఞానపాతకుల రక్షామార్గమున్ గూర్చు త
న్నాథుం డాకలికావతారి మనకున్ వర్తించు సర్వస్వమై. 601

—♦ అశ్వాసాంతము ♦—

ఉ. జీవరహస్య మీశ్వరుని జేరెడుత్రోవలు మూసివేసి దు
ర్భావపరం పరంబయిన వామపథంబులు జూపుచున్న యీ
వేవెలుఁ గొక్క రాక్షసిప్రవీణులసైతము మోసగించి మై
కా వని బెట్టికన్నులకు గంతలు కట్టెను సీల్లవేయుచున్. 602

క. ఈసూఫివేదాంతము
భాసుర విజ్ఞానతత్త్వపథ విశ్రుత వి
న్యాసనముల్లాసము సము
పాసితము క్తిప్రపచంబు భక్తుల కెలమిన్. 603

తే. గీ. దీని జదివినవిన్న విజ్ఞాన గరిమ
కర్మములు నీతిభాధలు కలుష చయము
రాగరోషాదు లుడుగు విశ్రాంతికలుగు
నిత్య కళ్యాణములు గూర్చు నెనరునించు. 604

## —♦ మంగళమహాశ్రీవృత్తము ♦—

మబ్బుల నెమిళ్ళవలె మంద తనువాసి యెదమార్కొనెడు మాయ విడనాడఁడన్। నిబ్బరము తెన్నెఱిఁగి నీరజజలాశయము నింపు విధమంటక ప్రపంచం। బబ్బునెడతోరణలయందు గల యాకువలె నాడియడియాసల నడంచన్। దబ్బరల మాను నిజతాపసికి విశ్వము ముదంబగు తమంగళమహా శ్రీ శ్రీ శ్రీ

### గద్య

ఇది శ్రీయైస్లామిక ఖాదరియా గోత్ర పవిత్ర మదీన్ కబీర్ గురువంశ
పయః పారావార రాకాసుధాకర మహర్షి మొహియదీన్ బాద్షావా
న్బియాంబికా గర్భశుక్తిముక్తాఫలచతుర్విధ సంస్కృతాంధ్రనా
నాపాశ్చాత్యపారసీకాంగ్లభాషా కూలంకష మహాపండిత
కవి మౌలావీబిరుదాంకిత శతాధిక కావ్యవిరచిత శతావధా
నాదికళా నిపుణాఖిల భారత శాసన మహా సభా
సభ్యా ధ్యాత్మిక విద్యా పీఠాచార్య ఉమర్
అలీషాకవి కృత సూఫీవేదాంతదర్శ
మహాసంహిత యను నుపనిష
ద్రూపయోగశాస్త్రము
సంపూర్ణము

